శ్రీ

దేవాంగ బ్రహ్మ ప్రతిపాదకము

# వేదోక్త మూల స్తంభనము

సంక్షిప్త తాత్పర్యము

విద్వాన్, పింజల సోమశేఖరరావు

ప్రభవ : శ్రావణము 1987
ప్రథమ ముద్రణము - 1000 ప్రతులు

మూల్యము *5-00*

ప్రతులకు :
**పింజల సోమశేఖరరావు**
వేటపాలెము, రావూరిపేట
చీరాల తాలూకా, ప్రకాశంజిల్లా.

ముద్రణ
లిబర్టీ ప్రింటర్స్ - చీరాల.

# మున్నుడి

శ్రీ మదఖిల భారత దేవాంగ మహాజనులకు మూలపురుషుడగు దేవలుని పరబ్రహ్మత్వము ప్రతిపాదించుచు వేదోపనిషత్తులందక్కడక్కడ చెప్పబడిన విషయ సంగ్రహమే శివషణ్ముఖ సంవాదాత్మక మూల స్తంభనము. సంస్కృత భాషయందున్న దీనికి పందొమ్మిదవ శతాబ్దాంతమున మైసూరు వాస్తవ్యులు, దేవాంగవంశ మహోదయులునగు శ్రీ శివశంకర యోగీంద్రులు కర్ణాట భాషయందు టీకాతాత్పర్యములు రచించి కన్నడ దేవాంగులకుప యుక్తముగ ప్రకటించి యుండగా 1925 లో మదరాసు వాస్తవ్యులు, దేవాంగ వంశోద్భవులు, శ్రీ మద్రామాయణాంధ్ర వ్యాఖ్యాన కర్తలునగు శ్రీ బొగ్గర ఆదినారాయణగారు, శివశంకర యోగీంద్రకృతి కాంధ్రానువాద మొనర్చి ఆంధ్ర దేవాంగ జనోప యుక్తముగ ప్రచుర ప్రాచుర్యములు గలిగించిరి. దేవాంగ జాత్యుత్కృష్టమున కొక మఱి దర్పణముగా జెప్పదగు నీ మూల స్తంభన గ్రంథములు నేడలభ్యమగుట తదావశ్యకతను గుర్తించి దేవాంగ పురాణమును హృద్య పద్య గద్యాత్మక మహా కావ్యముగ రచించుటయేగాక దేవలతత్త్వ మందఱికీ సులభ గ్రాహ్యము గావలయునను తలంపున "దేవల మను బ్రహ్మ" అనుపేర వచన కావ్యమును, "దేవల మహర్షి" అనుపేర నాటకమును, ప్రదర్శనానుకూలముగ రచించి ప్రచురించిన వాడనగుటను, దేవలుని విద్యాధరాద్యవతార సప్తకమును నాటములుగా నొనరించిన వాడనగుటను నేడీ దేవాంగబ్రహ్మ ప్రతిపాదక వేదోక్త మూల స్తంభన గ్రంథమును, ప్రతిపదార్థ భాగముమాని, సంక్షిప్త తాత్పర్యముతో జదువరులకు సులభతరము గావించి ప్రకటించుటతో జాతికి నా సమగ్ర సాహితీసేవ నందింప గలిగిన వాడనైనందుల కెంతో సంతోషించు చున్నాను.

దీనికిముందు ప్రకటించిన దేవల మహాబ్రహ్మ వచన కావ్య ప్రతులు చాలవరకు మాష్టరు వీవరు మహాశయుల ద్వారా సొమ్ము చేయించుటకు నాకన్ని విధముల సాయపడిన శ్రీ పింజల సుబ్రహ్మణ్యము, బందారు సుబ్బారావు, లేళ్ళ వెంకటేశ్వర్లు, జాగాబత్తుని నాగలింగేశ్వరరావు ప్రభృతులను ఆయురారోగ్య భాగ్యములిచ్చి కాపాడవలయునని జగదంబయగు చౌడాంబ కృపాలంబన మర్థించు చున్నాను.

ఆంధ్ర సారస్వతమున కపూర్వాలంకారముగ సంతరించిన నా దేవాంగ సాహిత్యము లోకము గుర్తించి నపు డంత కన్న నాకు గావలసిన దేముండును?

ఇట్లు

పింజల సోమశేఖరరావు.

ఓం శ్రీ దేవాంగ పరబ్రహ్మణే నమః

# శ్రీ దేవాంగ బ్రహ్మ ప్రతిపాదకము వేదోక్తమూల స్తంభనము

:- ఇష్టదేవతాభి వందనము :-

వాగీశాద్యాః సుమనసః సర్వార్థానా ముపక్రమే
యం నత్వా కృతకృత్యాస్యు స్తం నమామి గజాననమ్

యస్యాజ్ఞయా బ్రహ్మముకుందకాల
రుద్రాః స్వశక్తి సంహృతీనాం
కర్తృత్వమాపు ర్జగత స్తమీశం
వందే శివం శంకర మాత్మరూపమ్.

శ్రీమద్దివ్య సువర్ణ రత్నమకుటాం సిందూర ఫాల స్థలాం
సీమంతీకృత చారుచంద్రకలికాం హేమాంబరాడంబరాం
వక్షోలంబిత హారహీరరుచిరాం బింబోష్ఠీం శ్యామలాం
దేవీం త్వాం ప్రణమామి సంతత మహం చౌడాంబికాం మాతరమ్.

ముక్తావిద్రుమహేమనీలధవళచ్ఛాయై ర్ముఖై స్త్రీక్షణై
ర్యుక్తా మిందునిబద్ధ రత్నమకుటాం తత్త్వార్థ వర్ణాత్మికాం
గాయత్రీం వరదా భయాంకుశకశాం శుభ్రం కపాలం గదాం
శంఖం చక్ర మథారవిందయుగళం హస్తై ర్వహంతీం భజే.

అజ్ఞాన తిమిరధ్వంసం విజ్ఞానస్య ప్రవర్ధనం
స్వర్గాపవర్గఫలదం గురుదేవ మహం భజే.

## -: శ్రీ మద్దేవాంగ పరబ్రహ్మస్తోత్రము :-

ఓం అస్యశ్రీ గురుదేవాంగ పరబ్రహ్మస్తోత్ర మహ మంత్రస్య, ఏకోరామార్యఋషిః, అనుష్టుప్ ఛందః శ్రీ దేవాంగ పరబ్రహ్మ దేవతా, ఓంబీజం, నమః శక్తిః, శివాయ ఇతి కీలకమ్, మమ శ్రీ గురు దేవాంగ ప్రసాద సిద్ధ్యర్థే జపే వినియోగః.

ఓం దేవలాయ అంగుష్ఠా భ్యాం నమః

ఓం నం సూత్రాత్మకాయ తర్జనీ భ్యాంస్వాహా

ఓం మం బ్రహ్మోపదేశకారణాయ మధ్యమాభ్యాం వషట్

ఓం శిం గాయత్రీ నిర్మితాయ అనామికాభ్యాం హుమ్

ఓం వాం పరశివఫాలచక్షు రుద్భవాయ కనిష్ఠి కాభ్యాం వౌషట్

ఓం యం సత్య స్వరూపాయ కరతల కరపృష్ఠా భ్యాం ఫట్

### అథహృదయాదిన్యాస :-

ఓం దేవలాయ హృదయాయనమః

ఓం నం సూత్రాత్మకాయ శిరసే స్వాహా

ఓం మం బ్రహ్మోపదేశకారణాయ శిఖాయై వషట్

ఓం శిం గాయత్రీ నిర్మితాయ కవచాయహుమ్

ఓం వాం పరశివఫాలచక్షురుద్భవాయ నేత్రత్రయాయ వౌషట్

ఓం యం సత్యస్వరూపాయ అస్త్రాయఫట్

ఓం భూర్భువస్సువరోమితిదిగ్బంధః

ధ్యానమ్ :-

శ్లో॥ వందే నిత్యం భవభయహరం సర్వలోకాధివాసం
నిత్యాకారం సకలజగతాం సూత్రధర్తార మాద్యం
కాలాతీతం త్రిగుణరహితం తత్త్వమస్యాదిగమ్యం
దేవాంగాఖ్యం పరమపురుషం సచ్చిదానందరూపమ్.

అథ మానసిక పంచపూజా :-

లం - పృథివ్యాత్మనే శ్రీ మద్దేవాంగాయ గంధం సమర్పయామి
హం - ఆకాశాత్మనే శ్రీ మద్దేవాంగాయ పుష్పం సమర్పయామి
యం- వాయ్వాత్మనే శ్రీ మద్దేవాంగాయ ధూప మాఘ్రాపయామి
రం - తేజసాత్మనే శ్రీ మద్దేవాంగాయ దీపం దర్శయామి
వం - అమృతాత్మనే శ్రీ మద్దేవాంగాయ అమృతోపహారం సమర్పయామి
సం - సర్వాత్మనే శ్రీ మద్దేవాంగాయ సర్వోపచారపూజాం సమర్పయామి

అథమూల మంత్రమ్ :-

స్వాచార్య సకాశాత్ లబ్ధోపదేశః శ్రీ దేవాంగద్వాదశాక్షరీ మహామంత్రం యథాశక్తిం జపిత్వా పునః ధ్యానం మానసిక పూజాం హృదయాదిన్యాసంచ కుర్యాత్ భూర్భువస్సువరో మిత్యుత్తర దిగ్విమోకః.

## శ్రీ దేవాంగాష్టోత్తర శతనామ స్తోత్రము :-

శ్లో॥ శ్రీ దేవాంగో మహాదేవో దేవలో దేవపాలకః
మహాదేవస్థితజ్యోతిః సృష్టిస్థిత్యంతకారకః 1

చూడాంబికాఖ్య సమ్ముక్తాశక్తి చిచ్ఛక్తి ధారకః
బ్రహ్మ విష్ణ్వీశసంపూజ్య పాదపంకజభాసిత 2

పరమాత్మా పరంజ్యోతిః పరబ్రహ్మ పరాత్పరః
పరేశ్వరసహస్రార పద్మాంతర ప్రభాసకః 3

యజ్ఞ కర్తా యజ్ఞ భోక్తా యజ్ఞసూత్ర స్వరూపకః
విశ్వకర్తా విశ్వభర్తా విశ్వరా డ్విశ్వకారణః 4

నిరాలంబో నిరాకారో నిరాభాసో నిరాకులః
నిర్వికల్పో నిరాతంకో నిష్కళంకో నిరంజనః 5

సర్వకర్తా సర్వసాక్షీ సర్వకారణకారకః
సూత్రకర్తా సూత్రధారీ సూత్రాత్మా సూత్రనాయకః 6
వేద వేదాంగ సంవేద్యో సచ్చిదానందవిగ్రహః
మహాదేవో మహద్రూపో మహావాక్యార్థగోచరః 7

నిత్యశుద్ధో నిత్యతృప్తో నిర్గుణో నిరుపద్రవః
సత్త్వాదిగుణ సంయుక్తో సాకారో సకలాన్వితః 8

సర్వలోకప్రతీకాశ స్సర్వలోక ప్రియంకరః
సర్వభూత స్వరూపశ్చ సర్వ భూతాధినాయకః 9

భూర్భువాదికలోకేశ స్త్వతలాద్యధినాయకః
సద్యోజాతముఖోత్పన్నో బ్రహ్మణే వేదదాయకః 10

సూర్యచంద్రాగ్ని నిలయో సౌమ్యో ప్రణవమందిరః

శైవముద్రాంకితధరో శైవాజ్ఞా పరిపాలకః
చూడాంబికాతనూజాతః పంచాచార్య ప్రతిష్ఠకః 12

గాయత్రీజననాధారః గాయత్రీపీఠనిర్ణయః
క్షీరాబ్ధి సంగతస్సూర్య తంతు సంపాదనోత్సుకః 13

శ్రీమన్నారాయణ ధ్యానచింతనోల్లాస మానసః
దేవగంధర్వ సంసేవ్యో దేవదత్తా మనోహరః 14

నందికేతన సంయుక్తో వక్రకుండలధారకః
మాయాతీతో మనుబ్రహ్మ మాయాంగో మహిమాఢ్యకః 15

జ్యోతిర్మయ శ్చిన్మయాత్మా శ్శుచిర్భూత సుఖప్రదః
ఆమోదవస్త్రనాధీశ స్త్వగ్నిదత్తామనః ప్రియః 16

బ్రాహ్మణ్యకప్రతిష్ఠాతా బ్రహ్మవిద్యాప్రదాయకః
రామలింగేశ్వరాకారో రామచంద్రప్రపూజితః 17

విద్యాధరః పుష్పదంతో వేతాళో భూతశిక్షకః
వరవిద్యాత్యావకల్ప వరరుచ్యవతారకః 18

చింతితాచ్యుత పాదాబ్జ శ్చిత్రయోగిస్వరూపకః
దేవశాలిసమాఖ్యాతో దేవదాసో మహామతిః 19

దేవాంగ బ్రహ్మవంశాద్యో దేవయజ్ఞఫలప్రదః
అష్టాంగయోగనిరత స్త్వప్రాకృతద్విజావనః 20

చతుష్షష్టి కళాధీశ శ్చాతుర్వర్ణ్యోపదేశకః
జగదంతర్బహిర్వ్యాప్తో జగత్సేవ్యో జగద్గురుః 21

ఏవం శ్రీ దేవదేవాంగ నామ్నా మష్టోత్తరంశతం
స్వర్గాపవర్గఫలదం సర్వారిష్ట నివారణం 22
పఠతాం శృణ్వతాం భక్త్యా సర్వాభీష్టప్రదం శుభమ్.
త్రిసంధ్యంచ పఠన్నిత్యం సర్వాన్ కామాన్ అవాప్ను
యాత్ 23

ఇతి శ్రీ స్కాందపురాణే సనత్కుమార సంహితాయాం రజతాచలఖండే గురుజ్ఞాన సుధార్ణవే అష్టాద శోఽధ్యాయః

## శ్రీ దేవాంగాష్టోత్తర శత నామావళిః :-

ఓం శ్రీ దేవాంగాయనమః
మహాదేవాయనమః
దేవలాయనమః
దేవపాలకాయనమః
మహాదేవస్థితజ్యోతిషేనమః
సృష్టిస్థిత్యంతకాయనమః
చూడాంబికాఖ్యసమ్యక్తాశక్తి-
చిచ్ఛక్తిధారకాయనమః
బ్రహ్మవిష్ణ్వీశసం పూజ్యపాద-
పంకజ భాసితాయనమః
పరమాత్మాయనమః 10
పరంజ్యోతిషేనమః
పరబ్రహ్మణేనమః
పరాత్పరాయనమః
పరేశ్వర సహస్రార పద్మాం-
తర ప్రకాశకాయనమః
యజ్ఞకర్త్రేనమః
యజ్ఞభోక్త్రేనమః
యజ్ఞసూత్ర స్వరూపకాయ
విశ్వకర్త్రేనమః

ఓం విశ్వభర్త్రేనమః
విశ్వరాజేనమః
విశ్వకారణాయనమః 20
నిరాలంబాయనమః
నిరాకారాయనమః
నిరాభాసాయనమః
నిరాకులాయనమః
ఓం నిత్యకల్యాణాయనమః
నిరాతంకాయనమః
నిష్కళంకాయనమః
నిరంజనాయనమః
సర్వకర్త్రేనమః
సర్వసాక్షయేనమః 30
సర్వకారణ కారకాయనమః
సూత్రకర్త్రేనమః
సూత్రధారిణేనమః
సూత్రాత్మనేనమః
సూత్రదాయకాయనమః
వేదవేదాంగ సంవేద్యాయ
నమః

ఓం సచ్చిదానందవిగ్రహాయ
మహాదేవాయనమః
మహాద్రిహాయనమః
మహావాక్యార్థగోచరాయ 40
నిత్యశుద్ధాయనమః
నిత్యతృప్తాయనమః
నిర్గుణాయనమః
నిరుపద్రవాయనమః
సత్త్వాది గుణసంయుక్తాయ
సాకారాయనమః
సకలాన్వితాయనమః
సర్వలోక ప్రతీకాశాయనమః
సర్వలోక ప్రియంకరాయ
సర్వభూతస్వరూపాయ 50
సర్వభూతాధినాయకాయ
భూర్భువాదికలోకేశాయనమః
అతలాత్యధినాయకాయనమః
సద్యోజాతముఖోత్పన్నాయ
బ్రహ్మదేవవరదాయకాయ
సూర్యచంద్రాగ్నినిల -
యాయనమః
సౌమ్యాయనమః
ప్రణవమందిరాయనమః
శైవఫాలాక్షసంభూతాయ

ఓం శివాయనమః 60
శైవాగమార్చితాయనమః
శైవముద్రాంకితధరాయ
శైవాజ్ఞాపరిపాలకాయనమః
చూడాంబికాతనూజాతాయ
పంచాచార్యప్రతిష్ఠకాయనమః
గాయత్రీజననాధారాయనమః
గాయత్రీ పీఠ నిర్ధయాయ
క్షీరాబ్ధి సంగతాయనమః
స్వర్ణతంతు సంపాదనోత్సు -
కాయనమః
శ్రీమన్నారాయణధ్యానచింత-
నోల్లాసమానసాయనమః 70
దేవంగధర్మసేవితాయనమః
దేవదత్తామనోహరాయనమః
నందికేతన సంయుక్తాయ
నక్రకుండల ధారకాయనమః
మాయాతీతాయనమః
మనుబ్రహ్మణేనమః
మాయాంగాయనమః
మహిమాఢ్యకాయనమః
జ్యోతిర్మయాయనమః
చిన్మయాత్మనేనమః 80
శుచిర్భూతాయనమః
సుఖప్రదాయనమః
ఆమోదవత్తనాధీశాయనమః

ఓంఅగ్నిదత్తామనఃప్రియాయ
బ్రాహ్మణ్యకప్రతిష్ఠాత్రేనమః
బ్రహ్మవిద్యాప్రదాయకాయ
రామలింగేశ్వరాకారాయనమః
రామచంద్రప్రపూజితాయ
విద్యాధరాయనమః
పుష్పదంతాయనమః 90
బేతాళాయనమః
భూతశిక్షకాయనమః
వరవిద్యావ్యాపకాయనమః
వరరుచ్యవతారకాయనమః
చింతితాచ్యుతపాదాబ్జాయ
చిత్రయోగిప్వరూపకాయ

ఓం దేవశాలిపమాఖ్యాతాయ
దేవదాసాయనమః
మహామతయేనమః
దేవాంగబహ్మవంశాద్యాయ 100
దేవయజ్ఞ ఫలప్రదాయనమః
అష్టాంగ యోగనిరతాయనమః
అహింకృత ద్విజాపనాయ
చతుష్షష్ఠి కళాధీశాయనమః
చాతుర్వర్ణ్యోపదేశకాయనమః
జగదంతర్బహిర్వ్యాప్తాయ
జగత్పేవ్యాయనమః
జగద్గురవేనమః 108

శ్రీ దేవాంగాష్టోత్తర శతనామావళి సమాప్తము

1. శ్రీ దేవాంగ బ్రహ్మ విర్భావకాలే పరమేశ్వర కృతస్తోత్రము:-

శ్లో॥ అస్య దేవలమంత్రస్య గాయత్రీ నిర్ణయః ఖలు
త్వమేవ దేవలోమూర్తిం పమ్యక్చింతయ పంద్భధం
అద్యక్షరమతోబ్రహ్మన్ జ్ఞేయాం ఛందాంసిదేవతాః
అహం వై దేవలో ధ్యానం జాతరూపమయం మనుః
యప్య కేశేషుజలధో నద్యప్పర్వాంగసంధిమ
సూర్యచంద్రౌ యప్యనేత్రౌ దేవాంగబ్రహ్మణేనమః
ఆగమా అపిచత్వారో యస్య నిశ్వాసపంభవాః
పర్వోపనిషద ప్సాంగ దేవాంగబ్రహ్మణేనమః
ఓంకారో యప్యభవనం నాదః కల్యాణ మంటపం

బిందుసింహాసనంయస్య దేవాంగబ్రహ్మణేనమః
యన్నేత్రి రూపసంభూతో వహ్నికాలాగ్ని రుద్రతే
పంచభూతాత్మరూపాయ దేవాంగబ్రహ్మణేనమః
తృణవృక్షలతావల్లీ శాఖాపర్వత మాదయః
యస్య దేహస్థరోమాణ్యః దేవాంగబ్రహ్మణేనమః
శిక్షా యస్య జగచ్ఛిక్షా కల్పితో విశ్వకర్మకః
కల్ప సూత్రాణి యత్సూత్రం దేవాంగబ్రహ్మణేనమః
యస్య లీలావతారాణాం యస్యాశ్చరిత్ర మద్భుతం
కథయంతి కథాగాథాః దేవాంగాయనమోనమః

ఇతి స్కాంద పురాణే సనత్కుమార సంహితాయాంరజతా చలఖండే గురుజ్ఞాన సుధార్ణవే ఏకోన వింశత్యధ్యాయః.

## :- సంవాద ప్రారంభము :-

శ్లో॥ పూర్వం మునికులశ్రేష్ఠ స్సర్వశాస్త్ర విశారదః
సనత్కుమారః పప్రచ్ఛ నందీశం ప్రమథేశ్వరమ్.

తా॥ పూర్వము, మునికులమున శ్రేష్ఠుండును, సకల శాస్త్రములు తెలిసినవాడు నగు సనత్కుమారుడు, ప్రమథుల కధిపతియగు నందీశ్వరునిజూచి యిట్లడిగెను.

శ్లో॥ నందీశ్వర మహాప్రాజ్ఞ కలికల్మషనాశక
త్వత్తశ్శ్రుతాని శాస్త్రాణి సర్వాణి వివిధాని చ
ఇదానీం శ్రోతు మిచ్ఛామి వేదవేదాంత సమ్మతం
దేవాంగ మునిమాహాత్మ్యం తథా తత్కులవిస్తరం
బ్రూహి మే శ్రుతిసమ్మత్యా నందీశ కరుణానిధే.

తా॥ కలిదోషములను నివారింపగల ప్రభావముతోడి మహా ప్రజ్ఞావంతుడవైన నందీశ్వరా! కారుణ్యమునకు నిధియైనవాడా! నే నిదివరకు నీవల్ల పెక్కుశాస్త్రములు వినియుంటిని. వేద వేదాంత సమ్మతంబైన దేవాంగముని ప్రభావమును, అతని కుల విస్తార విశేషములును విననలయుననని వేడుక పడుచున్నాను వేద సమ్మతముగ నాకీ విషయము వినిపింపుము.

శ్లో॥ సనత్కుమార వచనం శ్రుత్వా నందీశ్వరోఽబ్రవీత్
బ్రహ్మాదీనామమేయం యన్మాహాత్మ్యం దేవలస్యతత్
పృష్టం త్వయాద్యయోగీంద్ర సర్వలోకహితాయచ
వేదవాక్యాని సంగృహ్య తత్రతత్రతు శంభునా

షణ్ముఖాయోదితం పూర్వం సర్వపాపనిబర్హణం
దేవాంగ చరితం దివ్యం సర్వారిష్ట నివారకం
నిగమాగమసమ్మత్యా వక్ష్యామి శృణు సాదరమ్.

తా॥ సనత్కుమారు డడిగినదానికి నందీశ్వరు డిట్లు చెప్పెను. యోగివరేణ్యుడవైన సనత్కుమారా! నీ వడిగిన దేవల మను బ్రహ్మ మాహాత్మ్య మిట్టిదని నిర్దేశించి చెప్పవలయునన్న బ్రహ్మాదులకును సాధ్యముగాదు. ఇట్టి యీ దేవాంగముని ప్రభావము తెలిసికొన వలయునని కుమారస్వామి, తండ్రియగు ఈశ్వరుని నీవడిగినట్లే అడిగెను. ఈశ్వరు డపుడు దేవల మాహాత్మ్యమును వేదములం దక్కడక్కడ చెప్పబడిన విషయములను క్రోడీకరించి లోకోపకారార్థముగ జెప్పిన విధమున సర్వపాప వినాశకము, సర్వారిష్ట నివారకము నగు దేవాంగ ప్రభావమును వేదశాస్త్రాది సమ్మతముగ నీకు జెప్పెదను, సావధానముగ వినుము.

శ్లో॥ సర్వత్ర వ్యవహారార్థం కృతాదిషు యుగేషుచ
వేదాగమోక్తం పరమం మూలస్తంభన నామకం
గ్రంథమేవ ప్రవక్ష్యామి శృణు విప్రకులోత్తమ
తస్య శ్రవణమాత్రేణ నరో యాతి పరాంగతిమ్.

తా॥ బ్రాహ్మణోత్తముడవైన సనత్కుమారా! దేవలబ్రహ్మను గురించి చెప్పు ఈ పవిత్ర చరిత్రము కృతయుగము మొదలుగా నాలుగు యుగములందును సకల లోకములవారు వ్యవహరించుకొనుటకు దగినట్లుగ మహోత్తమమగుచు వేదములందును, ఉపనిషత్తులయందును జెప్పబడినదై "మూలస్తంభనము" అను

పేర బిలువబడు చుండును. దీనిని శ్రద్ధగ వినినంత మాత్రము చేతనే నరులకు మోక్షము సిద్ధించును. ఆ మూల స్తంభన గ్రంథార్థమునే నీకు వినిపింతును సావధానముగ వినుము.

మూల స్తంభన:- పురా స్వయంభువి పరశివాత్మకజ్యోతి రజాయత
తజ్జ్యోతిషి త్రిగుణాత్మికాశక్తిః. తచ్ఛక్త్యా బ్రహ్మ
విష్ణు మహేశ్వరాః తేభ్యః ఉత్పత్తిస్థితిలయాః.

తా॥ ఈ దృశ్యమాన ప్రపంచసృష్టియే లేక పూర్వము. అఖండ సచ్చిదానందాద్వితీయ పరిపూర్ణ పరబ్రహ్మస్వరూప మొక్కటియే యున్నది. అందుండి స్వయంప్రకాశకంబై పరశివస్వరూప సాకారబ్రహ్మముగ బరిణమించిన మూలజ్యోతి యుదయించెను. ఆ మూల జ్యోతినుండి సత్త్వరజస్తమోగుణాత్మకమగుచు మూల ప్రకృతియై శక్తి యుద్భవించెను. ఆ శక్తివలన బ్రహ్మవిష్ణుమహేశ్వరులు ప్రభవించిరి. ఆ త్రిమూర్తుల వలన లోకములకు సృష్టి స్థితిలయములు జరుగుచుండెను.

మూల :- తదా బ్రహ్మాదయో వస్త్రసూత్రహీనాస్సంతః
లజ్జయా పరశివం ప్రోచుః సకల జగన్నిర్మాణ శక్తోపి
బ్రహ్మ బ్రాహ్మణ్య సంపాదక సూత్రవస్త్ర నిర్మాణే అశక్తోపి
నిఖిలలోకోత్పత్తికాలే సూత్రవస్త్రయో రనావశ్యకత్వాత్
తదాతత్సామగ్ర్యభావాచ్చ ప్రకృతసృష్టికాలే సూత్ర
వస్త్రయో రావశ్యకత్వాత్ త్వమేవ సూత్రకర్తారం నిర్మా
యాస్మాకదేహీతి.

తా॥ అపుడు, బ్రహ్మాదులగు త్రిమూర్తులు, సూత్రవస్త్ర హీనులగుటచేత సిగ్గుపడి, తమకధిష్ఠాన భూతుడైన పరశివుని

జేరి ప్రభూ! బ్రహ్మదేవుడు లోకములను సృష్టించు శక్తిగలవాడైనప్పటికి, బ్రాహ్మణ్యమునకు ప్రధానములైన యజ్ఞోపవీతములు, వస్త్రములు నిర్మింప జాలనివాడై నాడు, లోకోత్పత్తి కాలమున సూత్రవస్త్రములతో నవసరము లేకుండుటచేతను, వాని నిర్మాణమునకు వలయు పరికరములు సమకూర్చుకొనుటకు సైతము సందర్భ పడనిదయ్యెను. ప్రస్తుత సృష్టి కాలమున బ్రాహ్మణ్యమునకు సూత్రవస్త్రములుండి తీరవలెను. కనుక, మా కధిష్ఠాతవగు నీవే సూత్రకర్త నొకని నిర్మించి మా కొసంగ వలయునని ప్రార్థించిరి.

.: ఈ విషయమున నారద సంహిత ప్రమాణము :-

శ్లో॥ సృష్టేః పూర్వ మిదం సర్వ మఖండానంద రూపకం
నిరాకార పరంజ్యోతి రాసీ ద్దేవల సంజ్ఞికం
తస్మా జ్ఞాతంహి చిజ్జ్యోతి స్తదాప శివరూపతాం
తస్మా జ్జాతా మహాశక్తి స్సాసతీ త్రిగుణాత్మికా
తద్గుణా బ్రహ్మవిష్ణ్వీశ రూపతా మాప్యతే శివం
ఊచు ర్వయం వస్త్రహీనా స్తస్మాన్నో బాధతే త్రపా
ఇదానీం సూత్రకర్తారం నిర్మాయాస్మాక మీశ్వర
తేన దాపయ సూత్రాదీన్ దేవ దేవ పరాత్పరం.

తా॥ విశ్వసృష్టికి పూర్వము జగమంతయు, అద్వితీయమైన అఖండానందాత్మకముగ దేవల బ్రహ్మనామమున నిరాకార పరంజ్యోతి యుండెను. ఆ నిరాకార పరంజ్యోతినుండి జ్ఞానైక రూపంబగు చిజ్జ్యోతి ఆవిర్భవించెను. ఆ చిజ్జ్యోతియే పరశివ స్వరూపంబగు సాకారబ్రహ్మము. ఆ పరశివ రూపంబువలన రజస్సత్త్వ తమో గుణాత్మకమగు మహాశక్తి యుద్భవించెను.

ఆ పరాశక్తియొక్క త్రిగుణములవలన సృష్టిస్థితి లయకారకులగు బ్రహ్మ విష్ణు మహేశ్వరు లుదయించిరి. ఆ బ్రహ్మాదులు, దిగ్వస్త్రులయుండగు పరశివునిజేరి, దేవేశ్వరుడవైన ఓ పరమేశ్వరా! మేము వస్త్రసూత్రములు లేని కారణమున లజ్జా పీడితుల మగుచున్నాము. మా కొఱకు సూత్రవస్త్ర నిర్మాణకర్త నొక్కని నిర్మింపుము. అతని మూలమున మాకు బ్రాహ్మణ్య సంపాదకములుగ వస్త్రములు యజ్ఞోపవీతములు కలుగునట్లును గ్రహింపుమని ప్రార్థించిరి.

మూల :- తత శ్శివోఽంతర్జ్యోతి ర్బహిః కృతవాన్ తచ్చసాకృతం సత్, స్వయమేవ సూత్రవస్త్ర నిర్మాయ సమంత్రకం త్రిమూర్తీనాం దత్వా తత్రైవాంతరధాత్.

తా॥ అట్లు త్రిమూర్తులగు బ్రహ్మ విష్ణు మహేశ్వరులు ప్రార్థింపగనే పరశివుడు, తన సహస్రార కమలాంతరమున దేవలనామకముగ ప్రకాశించు అంతర్జ్యోతిని వెలువరించెను. ఆ వెలువడిన అంతర్జ్యోతి పరశివుని ఆదేశానుసారముగ సర్వాంగ సౌష్టవముగ ఆకారము ధరించి సంకల్ప మాత్రమున సూత్రవస్త్రములు నిర్మించి మంత్రపూర్వకముగ త్రిమూర్తుల కొసంగి, అపుడే పరశివ సహస్రారమును బొంద అంతర్ధాన మయ్యెను.

-: ఈ విషయమున అథర్వణవేద ప్రమాణము :-

జట :- శైవంజ్యోతి స్సాకారం బ్రహ్మణో విష్ణురుద్రస్య సూత్రాదిమాదిశత్.

తా॥ పరశివుని సహస్రార పద్మమున అంతర్గతమైయున్న జ్యోతియే ఆకారము వహించి బ్రహ్మ విష్ణు మహేశ్వరులకు సూత్ర వస్త్రము లిచ్చెను.

మూల ॥- అనంతరం బ్రహ్మ చతుర్దశలోకాన్ తదంతర్గత దివిజ జరాయు జాండజ స్వేదజాది ప్రాణిజాత మసృజత్ తతో బ్రహ్మాదీనాం వివాహసమయే సర్వేదేవా సూత్రవస్త్రహీనా స్సమాగతాః బ్రహ్మాచ వస్త్రరహితాన్ సలజ్జాన్ దీనాన్ తాన్ దృష్ట్వా సూత్రవస్త్రార్థం కైలాసంగత్వా శివంప్రార్థయా మాస.

తా॥ తరువాత, బ్రహ్మదేవుడు, భూర్భువస్సువర్లోకాదు లగు ఊర్ధ్వలోకములును, అతల వితలాదులగు అధోలోకములును గల పదునాలుగు లోకములను, అందు వసించు దేవమానవ మృగ ఖగ క్రిమి కీటకాది వర్గములను సృజించెను. అటు పిమ్మట, బ్రహ్మ విష్ణు మహేశ్వరులకు వివాహకాలము తటస్థించెను వారి వివాహములకు దేవతలందఱును వస్త్రములు సూత్రములు లేకయే వచ్చిరి. అట్లు లజ్జా పీడితులై దీనముఖములతో వచ్చిన దేవత లను జూచి బ్రహ్మదేవుడు, వారికి వస్త్రసూత్రములు లభింప జేయుటకు కైలాసమునకేగి పరమేశ్వరుని ప్రార్థించెను.

-॥ఈ విషయమున తత్త్వనిధి తృతీయాధ్యాయము ప్రమాణము॥-

శ్లో॥ తేషా ముద్వాహ కాలేతు దేవ గంధర్వ కిన్నరాః
ఆచ్ఛాద్య స్వతనూః వస్త్రై ర్వస్త్రాభావా త్తథాజినైః
లజ్జావనమ్రవదనా ఆగతా బ్రహ్మణోంతికం
తతస్తా న్వస్త్రహీనాంగాన్ దృష్ట్వా దేవాన్ పితామహః
తత స్తై స్సాక మాసాద్య కైలాసం గణసేవితం
దృష్ట్వా తత్ర మహాదేవం నమస్కృత్యాబ్రవీద్వచః
మయాసృష్టా ఇమే దేవా స్స్వామిన్ వస్త్ర వివర్జితాః

ఆచ్ఛాద్య స్వతమః పత్రై ర్లజ్జయా విచరంతిహి
ఇదానీం సూత్రకర్తారం నిర్మాయ జగదీశ్వర
సూత్ర వస్త్ర విధోఽస్మాకం దాపయ ప్రమథాధిప.

తా॥ బ్రహ్మాదుల వివాహకాలమున, దేవగంధర్వ కిన్నరాదులగు దేవజాతులందఱును తమకు వస్త్రములు లేని కారణమున ఆకులు, చర్మములు చుట్టుకొని సిగ్గుచేత తలవంచుకొన్నవారై బ్రహ్మదేవుని సన్నిధికి చేరిరి. అట్లు వస్త్రహీనులై వచ్చిన ఆ దేవతలను జూచి, బ్రహ్మ మిక్కిలి విచారపడి వారందఱికి వస్త్రసూత్రము లొసగగోరు తలంపుతో వారినెల్ల వెంట నిడుకొని ప్రమథ గణములతో గూడియున్న కైలాసముం జేరి లోకశరణ్యుడగు పరమేశ్వరునికి నమస్కరించి యిట్లు పలికెను. ఓ మహాదేవా! నాచే సృజింపబడిన దేవగంధర్వాది దేవతలందఱును అంగరక్షణకు వస్త్రములు లేక ఆకులు చర్మములు అడ్డముపెట్టుకొని సిగ్గుతో ఎట్లు వరితపించుచున్నారో చూడుము. ఓ ప్రమథేశ్వరా! సూత్రవస్త్ర నిర్మాత నొకని నిర్మించి మా కందఱికి వస్త్రసూత్రము లొసగున ట్లనుగ్రహింపుము.

-: సామవేదము 24 వ శాఖ ప్రమాణము :-

శ్రుతి :- సూత్రదాతా సౌదేవలో దేవతానామ్.

ఈ వాక్యమునకు విద్యారణ్యుల భాష్యమునకు తాత్పర్యము.

తా॥ లోక ప్రసిద్ధుడును, పరశివుని అంతర్జ్యోతినుండి యుదయించినవాడును, వస్త్రసూత్రములు నిర్మింపసమర్థుడునగు ఈ దేవలబ్రహ్మ బ్రహ్మాదుల వివాహసమయమున వస్త్రములు

లేక ఆకులు చర్మములు చుట్టుకొని వచ్చిన దేవతలకు వస్త్రములు సూత్రము లొసంగెను.

మూల 1. తతః ఈశ్వర సహస్రారాంత స్థితం జ్యోతిం యోగ మాయయా బహిః ప్రకాశం కృత్వా తజ్జ్యోతిం దృష్ట్వా త్వయా శీఘ్రం వివాహ సమయ ఏవ సూత్రవస్త్ర నిర్మాయ దేవానాం దాతవ్య మిత్యాజ్ఞాపయామాస.

తా॥ బ్రహ్మదేవు డట్లు ప్రార్థించినమీదట, పరశివుడు తన సహస్రార పద్మాంతరాళమున వెలుగుచుండు చిజ్జ్యోతిని తనయోగమాయా ప్రభావమున ఆకారసమన్వితముగ వెలువరించి, నీవు శీఘ్రముగబోయి బ్రహ్మాదుల వివాహకాలమందే వస్త్ర సూత్రములు నిర్మించి దేవతలందరి కిమ్మని ఆజ్ఞాపించెను.

-: ఇందుకు నారద సంహిత ప్రమాణము :-

శ్లో॥ శివ దేహస్థితజ్యోతిః సృష్టి స్థిత్యంత హేతుకం
ప్రాప్య దేవలరూపత్వం కర్తాభూత్ సూత్రవస్త్రయోః.

తా॥ లోకముల సృష్టిస్థితిలయములకు కారణభూతమగుచు పరశివుని దేహాంతరాళమున తేజోరూపమున వెలుగుచుండిన ఆ చిజ్జ్యోతియే ఆకారము వహించి దేవల బ్రహ్మరూపమున పరమేశ్వర నిర్దేశాను సారముగ సూత్రవస్త్ర నిర్మాణకర్తృత్వము వహించెను.

మూల 1. తతస్సో త్యంత కుతూహలస్సన్ సృష్టిస్థితి సంహార కర్త్రూణాం బ్రహ్మ విష్ణు మహేశ్వరాణాం వివాహసమయే తత్తన్మంత్ర పూర్వకం సూత్ర వస్త్రాదత్వా తత్రైవ సాయుజ్య మగమత్.

తా॥ పరమేశ్వరు డట్లాజ్ఞాపింపగనే పరమోత్సాహముతో గూడినవాడై దేవలబ్రహ్మ సూత్రవస్త్ర నిర్మాణమొనర్చి లోకా లకు ఉత్పత్తిస్థితిలయ కారకులైన బ్రహ్మ విష్ణు మహేశ్వరులకు వారివారి వివాహ కాలమందే ఆయా మంత్రములతో సూత్ర వస్త్రము లిచ్చి పరమేశ్వరునిలో జేరిపోయెను.

-: ఇందుకు అథర్వణ వేద ప్రమాణము :-

శ్రుతి :- తేదేవా అగమన్ వాసస్సూత్రం దేవలా దిత్యాహ ప్రజాపతిః

తా॥ దేవతలు దేవలబ్రహ్మ వలన వస్త్ర సూత్రములు హొందినారని బ్రహ్మదేవుడు, వాలఖిల్యాదులకు జెప్పెను.

మూల :- సకల జగత్కారణ స్వయంభు దేవాంగ బ్రహ్మకల్పిత దేవ మనుమానవ యక్ష రక్షో పిశాచ భూత బేతాళాది గ్రహాణాం స్వయం సూత్రకర్తే రితి ఉపనిషద్వాక్య మహిమ్నా ఉదాహరణ మాహ.

తా॥ స్వయంభువైన దేవలబ్రహ్మయే సమస్తలోకాలకు సృష్టిస్థితిలయ కారకుడు. ఆ దేవలబ్రహ్మయే దేవ మను మానవు లకును, యక్షరాక్షస పిశాచ భూత బేతాళాది గ్రహాలకును తానే సూత్ర వస్త్ర ప్రదాన కారకుడయ్యెనని ఉపనిషద్వాక్యములను ఉదాహరణ పూర్వకముగ శంకరుడు కుమారస్వామికి జెప్పెను.

-: దీనికి మహోపనిషత్తు ప్రమాణము :-

జట :- అథ భరద్వాజః పప్రచ్ఛ యాజ్ఞవల్క్యం కోవిశ్వరాట్ కోవిశ్వకర్తా కోవాబ్రహ్మ తన్మే బ్రూహీతి సహోవాచ

యాజ్ఞవల్క్యః, యేనేదం జగతత్సృష్టం యేనేదంవ్యాప్తం యస్మిన్ సర్వం ప్రతిష్ఠితం య స్స్వమాయయా వృత స్సన్ నామరూపతాం భజతి యస్సకల సురేభ్యో సూత్రి వక్త్రదాతా సదేవాంగో విశ్వరాట్ విశ్వకర్తా సబ్రహ్మ సవిరాట్ సర్వం దేవాంగ ఏవేతి.

తా॥ పూర్వము భరద్వాజమహర్షి యాజ్ఞవల్క్యుడనే మహర్షిని జూచి, ఎవడు విశ్వమున కధినాధుడు, ఎవడు లోకములను సృజించినవాడు, ఎవడు పరమాత్మ, ఈ విషయము నాకు జెప్ప వలసినదని యడిగెను. భరద్వాజునకు యాజ్ఞవల్క్యు డిట్లుచెప్పెను. ఈ విశ్వ మెవనిచే సృజింపబడినదో, ఎవనిచేత వ్యాప్తినొందినదో, ఎవనియందు లయించుచున్నదో, ఎవడు తన మాయచేత నామ రూపములతో వ్యవహరింప బడుచుండునో, దేవతలందఱికీ బ్రహ్మణ్య సంపాదనార్థము యజ్ఞోప వీతముల నిచ్చెనో ఆ దేవల బ్రహ్మయే విశ్వమున కధినాధుడు, విశ్వకర్త, అతడే పరాత్పరుడు. అతడే విరాట్పురుషుడు. సర్వమును దేవాంగ మయమే యయియుండెను.

-: నిరాలంబోపనిషత్తునందలి ప్రమాణము :-

శ్లో॥ విశ్వకర్తా విశ్వభోక్తా విశ్వహర్తా సదేవలః
స ఏవదేవతాధీశో మాయాతీతో నిరాకులః
సర్వవ్యాపీ సదేవాంగ కృతవాన్ సకలంజగత్.

తా॥ ఆ దేవల బ్రహ్మయే విశ్వమును సృజించినవాడు, విశ్వమును పోషించువాడు, విశ్వమును హరించువాడు. అతడే

దేవతలందరికీ అధినాధుడు. అతడేమాయ నతిక్రమించినవాడు· ఏ వ్యాకులమూ లేనివాడు. విశ్వవ్యాపకుడు. ఆ దేవల బ్రహ్మయే సమస్తజగత్తును సృజించెను.

-: జాబాలోపనిషత్తు ప్రమాణము :-

మూల :- యేన సర్వంసృష్టం యస్యభాసా సర్వంవిభాతి యోవా సర్వభూతాంతరాత్మా సదేవాంగోమనుః ససూత్రధారీ సశుద్ధ బ్రహ్మ ప్రకృత్యధిష్ఠాతా సర్వకారణభూతః.

తా: ఎవనిచేత స్థావర జంగమాత్మకమగు యీ ప్రపంచము సృష్టింప బడినదో, ఎవని తేజస్సుచేత లోకములన్నీ ప్రకాశించునో, సకల భూతములకూ అంతరాత్మయగుచు వెలుగు వాడెవ్వడో, ఆ పరాత్పరుడే దేవలబ్రహ్మ నామకమనువు. జగన్నాటక రంగమునకు సూత్రధారకు డాతడే. అతడే విజ్ఞానమయబ్రహ్మ. త్రిగుణాత్మకమగు ప్రకృతికి అధిష్ఠానభూతు డతడే. సమస్తమునకూ అతడే కారణభూతుడు.

-: నిరాలంబోపనిషత్తు ప్రమాణము :-

మూల :- విశ్వం యత్ తత్సర్వవ్యాపీ దేవాంగో కృతవాన్.

తా॥ సకల భూతాంతరాత్మయై వ్యాపించియుండు దేవల బ్రహ్మయే యీ లోకము లన్నిటికీ నిర్మాణ కారకుడు.

మూల :- తత్త్వమస్యాది మహావాక్య విషయత్వాత్ సఏవ జగత్కర్తా సదేవాంతరః సో సృష్ట్వా సఏవాను ప్రావిశతి.

తా॥ తత్త్వార్థ నిరూపణంబగు "తత్త్వమసి" "అహం బ్రహ్మాస్మి" "అయమాత్మాబ్రహ్మ" "ప్రజ్ఞానం బ్రహ్మ" అను మహావాక్య చతుష్కమునకు ఆ దేవల బ్రహ్మయే విషయభూతు డగుటచేత సకలలోకనిర్మాత అతడే యయియుండెను. దేవేతరు లింకెవ్వరును కాజాలరు. ఆ దేవల బ్రహ్మయే జగములను సృజించి ఆ జగములం దంతరాత్మయై వెలుగొందుచుండును.

-: రుద్రయామిళమునందలి ప్రమాణము :-

శ్లో॥ విశ్వకర్తా సదేవాంగ స్సబ్రహ్మా సచవిశ్వరాట్
సఏవవిష్ణు స్సోరుద్ర స్సకాలో౽గ్ని స్సచంద్రమా.

తా॥ ఆ దేవల బ్రహ్మయే సకలలోక నిర్మాత. అతడే సృష్టి కర్తయగు బ్రహ్మ. అతడే విశ్వవ్యాపకుడగు విష్ణు. అతడే లయకారకుడగు రుద్రుడు. అతడే భూత భవిష్యద్వర్తమాన కాల స్వరూపుడు. అతడే తేజోనిలయుడగు అగ్ని. అతడే మనో బుద్ధీంద్రియములకు అధినాథుడగు చంద్రుడు.

-: కాత్యాయన స్మృతి ప్రమాణము :-

శ్లో॥ విశ్వకర్తా విశ్వభోక్తా విశ్వవ్యాపీ సనాతనః
దేవాంగో పరమాత్మా సౌ సచ్చిదానందలక్షణః

తా॥ ఈ దేవాంగ బ్రహ్మయే ప్రపంచ నిర్మాణ కారకుడు, ప్రపంచ రక్షకుడు, ప్రపంచ వ్యాపకుడు, సత్యజ్ఞానానంద లక్షణములు గల పరమాత్మ.

-: నారద సంహిత ప్రమాణము :-

శ్లో॥ శుద్ధ బ్రహ్మ స్వరూపం తం దేవేశం సూత్రధారిణం
తత్త్వమస్యాది వాక్యార్థ గోచరం దేవలం సదా
నమస్కురు మహాబాహో భుక్తి ముక్తి ప్రదాయకమ్.

తా॥ మహాబాహు పరాక్రమ వంతుడవైన ఓ రాజేంద్రా! పరిపూర్ణ పరబ్రహ్మ స్వరూపుడును, దేవతలందరికీ అధీశ్వరుడును, జగన్నాటక సూత్రధారియును, తత్త్వమస్యాది మహా వాక్యార్థములకు లక్ష్యభూతుడును, ఐహికాముష్మిక సౌఖ్యము లిచ్చువాడు నగు ఆ దేవల బ్రహ్మకు ఎల్లప్పుడు నమస్కరింపవలెను. అని నారదమహర్షి అంబరీష చక్రవర్తికి బోధించెను.

## -3 ముండకోపనిషద్వాక్య ప్రమాణము

శ్లో॥ దేవదేవ మహాప్రాజ్ఞ లోకానుగ్రహకారక
అవ్యాజ కరుణామూర్తే రక్షనో జగదీశ్వర
వస్త్రహీనా వయంసర్వే తస్మాత్త్వం కరుణార్ణవ
సూత్ర వస్త్రాదికం దత్వా భృశ మస్మాన్ సముద్ధర
ఏవంసురగణైస్తుత్యో మహాదేవో కృపానిధిః
దేహాంతస్థిత చిచ్ఛక్తిం బహిఃకృత్వేద మబ్రవీత్
దేవి త్వం శీఘ్రమ ద్యైవ మత్పదధ్యాన తత్పరాః
వస్త్రోపవీతౌ నిర్మాయ దేవేభ్యో దాతు మర్హసి
శివాజ్ఞాం శిరసాధృత్వా సాశక్తి శ్చిత్స్వరూపిణీ
భూత్వా సదేహా సాదేవీ రేజే దేవల సంజ్ఞయా
నిర్మాయి సూత్రవస్త్రాణి సదేవాంగో దేవపూజితః
దేవానాంచ మునీనాంచ బ్రాహ్మణానాం తథైవచ
క్షత్రియాణాంచ వైశ్యానాం ప్రదదే మంత్రపూర్వకం
వస్త్ర మాత్రంతు శూద్రాణాం దత్వా సోంతరధా త్తతః
తస్మాత్సఏవ దేవాంగో బ్రాహ్మణ్యాధిప ఉచ్యతే
సబ్రహ్మచ సవైవిష్ణు స్సశివ స్సచవిశ్వరాట్.

తా॥ పూర్వము దేవతలు, పరశివుని సన్నిధికి వచ్చి "మహా ప్రజ్ఞాన సంతుడవైన ఓ దేవేశ్వరా! నిర్హేతుక జాయమాన కారుణ్యమున లోకాల ననుగ్రహించునట్టి ఓ జగత్ప్రభూ! మేమందఱము వస్త్రహీనులమై యున్నాము ఓ కరుణా సాగరా! వస్త్రసూత్రములిచ్చి మమ్ముద్ధరింపుము" అని ప్రార్థింపగా దయానిధియైన ఆ మహాదేవుడు, తన దేహాంతర్భాగమున జ్యోతీరూపమున వెలిగెడు చిచ్ఛక్తిని వెలువరించి, ఓ జ్ఞాన స్వరూపిణీ! నీవు మత్పదధ్యానాసక్తవగుచు శీఘ్రముగ వస్త్రములు, యజ్ఞోపవీతములు నిర్మించి దేవతల కీయవలసినదని ఆజ్ఞాపించెను. చిత్స్వరూపిణియైన ఆ పరాశక్తి పరశివుని ఆజ్ఞను శిరసావహించి ఒక పురుషాకృతిని ధరించి దేవల నామధేయమున విలసిల్లెను. తరువాత, ఆ దేవల బ్రహ్మ, దేవతలచేత మిక్కిలి పూజింపబడినవాడై సూత్రవస్త్ర నిర్మాణము గావించి, దేవతలకును, మునులకును, అటులే బ్రాహ్మణ క్షత్రియ వైశ్యులకునూ మంత్ర పూర్వకముగ సూత్రవస్త్రము లిచ్చెను. పిమ్మట శూద్రులకు వస్త్రములను మాత్రమే యిచ్చి అంతర్ధాన మయ్యెను, దేవతలు మొదలగు వారికి బ్రహ్మసూత్రము లిచ్చినవాడగుటచేత ఆ దేవల బ్రహ్మయే బ్రాహ్మణ్యము కలిగించుటకు అధికారిగా జెప్పబడెను. లోకాలకు సృష్టిస్థితిలయ కారకులగు బ్రహ్మ విష్ణు మహేశ్వరులున్ను ఆ దేవల బ్రహ్మయే. విశ్వమునకు ఆ దేవాంగుడే ప్రభువు.

-: తత్త్వ ప్రకాశికయందలి ప్రమాణము :-

శ్లో॥ వందే నిత్యం భవభయహరం సర్వలోకాధివాసం
నిత్యాకారం సకలజగతాం సూత్రధర్తార మాద్యం

భావాతీతం త్రిగుణరహితం తత్త్వమస్యాది గమ్యం
దేవాంగాఖ్యం పరమ పురుషం సచ్చిదానంద రూపమ్.

తా॥ జనన మరణములలో గూడిన సంసార దుఃఖమును హరించువాడును, లోకములన్నింట అంతరాత్మగానుండువాడును, జ్ఞానస్వరూపుడును, లోకము లన్నిటికీ సూత్రధారియును, ప్రధానమైనవాడును, భావముచేత నిర్దేశించి చెప్ప సాధ్యముగాని వాడును, రజస్సత్త్వతమములు లేనివాడును, "తత్త్వమసి" మొదలగు మహావాక్య చతుష్కమునకు లక్ష్యమైనవాడును, శక్తి జ్ఞానానందములే స్వరూపముగా ప్రకాశించు పరమాత్ముడును అగు దేవాంగ నామ బ్రహ్మనుగూర్చి నిరంతరము నమస్కరించుచున్నాము.

—॥ ముండకోపనిషద్వాక్య ప్రమాణము ॥—

శ్రుతి ॥— దేవలఏవ స్వమాయయావచ్ఛిన్నస్సన్, బ్రహ్మాద్యనేక రూపత యా భాసత్. తద్బ్రహ్మణి మాయావశాత్ చౌడేశ్వరీనామ చిచ్ఛక్తిర్జాతా సైతు తత్కులాధి దేవతాభూత్ తస్యపుత్రి కేతిచ వ్యవహ్రియతే తేచ తదుపాసకా బభూవుః"

తా॥ దేవల బ్రహ్మయే తన మాయా ప్రభావమున బ్రహ్మ విష్ణు మహేశ్వరా ద్యనేక రూపములతో విలసిల్లుచున్నాడు. ఆ దేవల బ్రహ్మయందు మాయా వశమున చౌడేశ్వరీ నామక పరాశక్తి ఉద్భవించెను. ఆ చౌడేశ్వరియే దేవాంగ కులము నకు అధిష్ఠాన దేవతయగును. దేవల బ్రహ్మపుత్రిక యనియు వ్యవహరింపబడు చుండును, దేవాంగకుల సంభవు లందఱును ఆ చౌడేశ్వరిని ఆరాధించుచుందురు.

-: నిగమరహస్య ప్రమాణము :-

శ్లో॥ శృణు నారద వక్ష్యామి జగదేతచ్చరాచరం
ఆ నిత్యసృష్టేః పురాసర్వం నిశ్చలం దేవలాత్మకం
స్వయమేవ బహుస్యా మిత్యాలోచ్య స్వస్య మాయయా
వ్యాప్య బ్రహ్మాది రూపేణ జగద్రూపేణవై తథా
ఏకధా బహుధాచైవ దృశ్యతే జలచంద్రవత్.

తా॥ నారదమహర్షీ! వినుము జంగమ స్థావరాత్మకమయిన యీ ప్రపంచ సృష్టి జరుగక పూర్వము చలన రహితమై దేవల స్వరూపముగ నుండెను. ఏకముగనున్న ఆ దేవలుడు తానే అనేక రూపముల నొందవలయునని తలంచి తన యోగమాయా ప్రభావమున సృష్టిస్థితిలయాది కారకులగు బ్రహ్మ విష్ణు మహేశ్వరాది రూపములతోడను, ప్రపంచ స్వరూపముతోడను సర్వ విధములుగను వ్యాపించి ఒక్క చంద్రుడే అనేక జల కుంభములం దనేక చంద్రులుగ ప్రతిబింబించి ఆ కుంభములందు నిత్యుడు కాని రీతి లోకమునకు అంటినట్లు కనబడుచు అంటకయే ఆత్మ స్వరూపమున ప్రకాశించుచున్నాడు. అని నారదునకు బ్రహ్మ చెప్పినట్లు తెలియుచున్నది.

-: వివేకసింధువు నందలి ప్రమాణము :-

శ్లో॥ దేవల బ్రహ్మ చిచ్ఛక్తి ర్జాతా చూడాంబికాభిదా
సా దేవాంగ బ్రాహ్మణానాం బభూవ కులదేవతా.

తా॥ దేవల బ్రహ్మ యందలి జ్ఞానశక్తియే చౌడేశ్వరీనామమున అవతరించెను. ఆమెయే దేవాంగ బ్రాహ్మణులకు కులదేవతగ విలసిల్లుచున్నది.

-: అగస్త్య సంహితయందలి ప్రమాణము :-

శ్లో॥ చూడాంబికే భగవతీ ప్రణతార్తి హంత్రి
దేవాంగ బ్రహ్మ కులదేవి సుసర్వపూజ్యే
వందామహే జనని దేవలపుత్రికే త్వాం
మాంపాహిపాహి జగదీశ్వరి మృత్యువక్త్రాత్.

తా॥ షడ్గుణైశ్వర్య సంపన్నవై భక్తుల దుఃఖముల హరించు చుండెడి ఓ జననీ! దేవలబ్రహ్మ పుత్రికవై ఆ దేవాంగ బ్రహ్మ కులమువారికి కులదేవతవుగా నుండి దేవపూజిత వగుచు వెలసిల్లు చూడాంబికా జగదీశ్వరీ! నీకు నమస్కరించు చున్నాను. నన్ను మృత్యు ముఖమునుండి రక్షింపుము! రక్షింపుము! అని అగస్త్యమహర్షి చౌడేశ్వరిని ప్రార్థించినట్లు అగస్త్య సంహిత.

-: కఠోపనిషద్వాక్య ప్రమాణము :-

శ్రుతి :- సర్వేదేవా ఈశ్వర మనమన్ అవస్త్ర స్వాలజ్జాః దీనాన్ తతస్తాన్ దృష్ట్వా మహాదేవ స్తదాగమనకారణం జ్ఞాత్వా ప్యస్మిన్ వర్తమానాం చిచ్ఛక్తిం బహిర్ముఖీ కృత్య త్వం శీఘ్రం యజ్ఞోప వీతాదికంనిర్మాయ బ్రహ్మాదీనాం ప్రయచ్ఛే త్యాజ్ఞాపయామాస, సాతు సదేహా సతీ బ్రహ్మాదీనాం యజ్ఞోప వీతాదికం దదౌ. తత్రతేషాం బ్రాహ్మణ క్షత్ర వైశ్యానాంచ యజ్ఞోపవీతం పరమం పవిత్రమితి వేద మంత్రేణ ప్రాయచ్ఛత్. ఇతర జాతీనాం వస్త్రమాత్ర మదదాత్. యజ్ఞాది కర్మ సంపాదనాయ యజ్ఞోప వీతధారణ మావశ్యకత్వాత్ బ్రహ్మ స్వరూపం త్రిగుణాత్మకం యజ్ఞోపవీతం దదౌ బ్రాహ్మణ క్షత్రియాణాం వైశ్యానాంచ.

శూద్రాణాంతు వస్త్రమాత్రమేవ వేదోక్త కర్మానర్హత్వాత్
తస్మాత్ బ్రాహ్మణ్యాధిప స్యాదేవల ఇతి మంతవ్యః.
గాయత్రీవ త్రిగుణాత్మికా సాక్షి స్వరూపిణీతి వ్యవహ్రి
యతే.

తా॥ దేవతలందఱును వస్త్రహీనులై అజ్ఞానమ్రముఖము లతో పరమేశ్వరుని ప్రార్థించిరి. దీనులయిన దేవతల ఆగమన కారణము తెలిసికొని. తనయందు జ్యోతిరూపమున వెలుగుచుండు చిచ్ఛక్తిని వెలువరించి, నీవు సూత్ర వస్త్ర నిర్మాణముచేసి బ్రహ్మాది దేవతల కిమ్మని ఆజ్ఞాపించెను. వెంటనే ఆ పరాశక్తి దేవల నామధేయమున పురుషరూపము ధరించి, బ్రహ్మాది దేవతలకును, బ్రాహ్మణాదులగు మానవులకును వస్త్రములు, యజ్ఞోపవీతములు నిర్మించి యిచ్చెను. సూత్ర పరిధాన విషయమున బ్రహ్మాది దేవతలకును, బ్రాహ్మణ క్షత్రియ వైశ్యులకు మాత్రము "యజ్ఞోపవీతం పరమం పవిత్రం" అను వేదమంత్ర పూర్వకముగ నిచ్చెను. శూద్రాదులకు వస్త్రములు మాత్రమే యిచ్చెను. యజ్ఞములు మొదలగు వైదిక కర్మలాచరింప అధికారము గలుగుటకు యజ్ఞోపవీతధారణ మావశ్యక మగుటచేత బ్రహ్మ స్వరూపమును, త్రిగుణాత్మకమును అగు యజ్ఞోపవీతములు మానవలోకమున బ్రాహ్మణ క్షత్రియ వైశ్యులకు మాత్రమేయిచ్చి, వేద ప్రతిపాదకమయిన బ్రాహ్మణ్యకర్మ శూద్రులకు అవకాశము కుదరదు గనుక వారికి వస్త్రములు మాత్రమే యిచ్చుటకు కారణమయ్యెను. బ్రాహ్మణ్య సంపాదకములగు బ్రహ్మసూత్రములు సమంత్రకముగ నిచ్చినవాడగుటచేత ఆ దేవల బ్రహ్మయే బ్రాహ్మణ్యాధికారము గలవాడు. అట్టిబ్రహ్మాదుల కనుగ్రహింపబడి గాయత్రి

నామకంబయిన ఆ బ్రహ్మోపవీతము త్రిగుణాత్మకమై సర్వలోక సాక్షిభూతమగుచు విలసిల్లుచుండెను.

-: యజ్ఞోపవీతధారణ మంత్రము :-

యజ్ఞోపవీతం పరమం పవిత్రం
ప్రజాపతే ర్యత్సహజం పురస్తాత్
ఆయుష్య మగ్ర్యం ప్రతిముంచ శుభ్రం
యజ్ఞోపవీతం బలమస్తు తేజః

తా॥ పూర్వము పరమాత్మతోనే పుట్టి సర్వోత్కృష్టమై సర్వపావనమై విలసిల్లునది యే యజ్ఞోపవీతము గలదో, అది దీర్ఘాయుష్షు నొసగునదియు, ప్రధానమగునదియు, సాటిలేనిదియు, ధావళ్యమైనదియు నగుచు తేజస్సు బలము నిచ్చునది యగుగాక.

-: సిద్ధాంత చంద్రికయందలి ప్రమాణము :-

శ్లో॥ ఈశ్వరీయాతు యాశక్తి ర్జగన్నిర్మాణకారిణీ
సావై దేవాంగరూపేణ సూత్ర వస్త్రాధికం ముదా
సురకిన్నర గంధర్వ యక్షేభ్యః ప్రదదౌ తదా,

తా॥ పరమేశ్వరునియందు సర్వలోక నిర్మాణ కారణంబుగ వెలుగొందుచుండు చిజ్జ్యోతియే దేవాంగ బ్రహ్మరూపము వహించి దేవకిన్నర గంధర్వ యక్షాది దేవజాతులందరికీ ప్రేమతో వస్త్రములు యజ్ఞోపవీతము లొసగెను.

-: ధర్మనిధియను ధర్మశాస్త్ర ప్రమాణము :-

శ్లో॥ దేవాంగే నో పదిష్టేన హ్యనేన ద్విజపుంగవ
యజ్ఞోపవీతం పరమం ఇతి మంత్రేణ సర్వదా.

తా॥ దేవాంగ బ్రహ్మచేత ఉపదేశింపబడిన "యజ్ఞోపవీతం పరమం పవిత్రం" అను మంత్రోచ్చారణతో బ్రాహ్మణులు యజ్ఞోపవీతము ధరింపవలయును. మంత్రరహితముగ ధరించిన పతితు లగుదురు.

-: ఋగ్వేదభాష్యమందలి ప్రమాణము :-

శ్లో॥ గుణత్రయాత్మకం యజ్ఞసూత్రం బ్రాహ్మణ్య హేతుకం
దేవలేన పురాదత్తం దేవతాభ్య శ్శివాజ్ఞయా.

తా॥ త్రిగుణాత్మకముగు యజ్ఞోపవీతము బ్రాహ్మణ్యకారణ మగుటచేత పూర్వము శివాజ్ఞతో దేవలబ్రహ్మ దేవతలకిచ్చిన వాడయ్యెను.

మూ॥ :- ఈశ్వరస్య స్వస్య పంచమముఖే ఉత్పన్నస్య విశ్వకర్మణః జగన్మాన జ్ఞానార్థం సూత్రాభావాత్ సమంత్రకం సూత్రాదికం దేవాంగేన దాపితవాన్ సతు తేన జగత్పరిమాణ మమన్యత.

తా॥ ఈశ్వరుని పంచమ ముఖమునుండి ఉద్భవించిన విశ్వకర్మ, తనకు సూత్రములేక పోవుటచేత ప్రపంచ పరిమాణ మెఱుగుట కష్టమై శంకరుని ప్రార్థింపగా శంకరు డాతనికి దేవల బ్రహ్మచేత సమంత్రకముగ బ్రహ్మసూత్రాదికము లిప్పించెను.

-: శ్రీ శైల మాహాత్మ్యము ఉత్పత్తికాండ ప్రమాణము :-

శ్లో॥ దేవ దేవ భవద్వక్త్రాత్ సంభూతో హ్యహమీశ్వర
సూత్రాభావా జ్జగన్మాతు మశక్తోఽహం కథంచన
తస్మా త్సూత్రం త్వయాదేవ దాతవ్యం మమహేతుకం
ఇతి సంప్రార్థితో పశ్చాత్ దేవాంగేన మహాత్మనా
సూత్రం దాపితవాం తస్మై మహేశో విశ్వకర్మణే.

తా॥ దేవేశ్వరుడవైన ఓ ప్రభూ! నేను నీ ముఖము నుండియే పుట్టినవాడ నైనప్పటికి సూత్రములేని కారణమున ప్రపంచముయొక్క కొలతలు తెలియనివాడ నైతిని. పరిమాణ సాధనమయిన సూత్రమును నా కనుగ్రహింపుమని విశ్వకర్మ ప్రార్థింపగా పరమేశ్వరుడు దేవలునకుజెప్పి అతనికి సూత్ర మిప్పించెను.

-: అధర్వణ వేదమందలి ప్రమాణము :-

బట :- దదౌ దేవాంగ సూత్రం వైవిశ్వ కర్మణ ఇత్యాహ ప్రజాపతిః.

తా॥ దేవాంగ బ్రహ్మయే విశ్వకర్మకు బ్రహ్మసూత్ర మిచ్చె నని బ్రహ్మదేవుడు చెప్పెను.

మూల :- తతో వైశ్వకర్మణోపి దేవాంగ ప్రసాదలబ్ధ యజ్ఞ సూత్రా ణ్య మంత్రకేణ ధారయామాసుః, తేన సూత్రాణి దగ్ధాని తేఽవ్యతిభయేన శివం సంప్రార్థ్య సూత్రాణి యాచ యామాసుః తత శ్శివాజ్ఞయా ప్రసన్నో దేవాంగో దగ్ధయజ్ఞోపవీతాన్ మ న్వాదీన్ దృష్ట్వాఽతిశయ కరుణయా

గాయత్రి మంత్రోపదేశ పూర్వకం యజ్ఞోపవీత దత్తవాన్.
అతఏవ యజ్ఞసూత్రమమంత్రకేణ నధార్య మితిమం
తవ్యమ్.

తా॥ తరువాత, విశ్వకర్మ కుమారులు, తమకు దేవల బ్రహ్మ యిచ్చిన యజ్ఞసూత్రములు మంత్రోచ్చారణ లేకయే ధరించినందున అవి కాలి పోయినవి. వారపుడు మిక్కిలి భయపడి పరమేశ్వరుని సన్నిధికేగి, విషయమంతయుం జెప్పి యజ్ఞసూత్రము లిమ్మని అడిగిరి. తరువాత, శివాజ్ఞచేత దేవలబ్రహ్మ వారియందు ప్రసన్న భావముతో సూత్రములు కాలిపోయినందులకు జాలిపడి గాయత్రి మంత్రోపదేశ పూర్వకముగ మరల యజ్ఞోపవీతము లిచ్చెను. కనుక, మంత్రరహితముగ యజ్ఞోపవీతధారణ చేయగూడదని తెలియవలెను.

—॥ దీనికి స్కాందపురాణ ప్రమాణము ॥—

శ్లో॥ ఉపవీతం యథా ధత్స్వ మంత్ర ముచ్చార్య ధారయ
అన్యథా తేపిరాజేంద్ర గతిస్స్యాత్ దైవశ్వ కర్మణామ్.

తా॥ ఓ రాజేంద్రా! నీవు యజ్ఞోపవీతము ధరించు నపుడు గాయత్రీ మంత్రోచ్చారణ పూర్వకముగ ధరింపుము, మంత్రోచ్చారణ చేయకుండ ధరింతువేని నీకును విశ్వకర్మ కుమారులకు గలిగిన దుస్థితియే కలుగును. అని గర్గమహాముని సింధురాజునకు జెప్పెను.

మూల :— స దేవల బ్రహ్మచారీ నిర్గుణః నిష్కళంకః నిత్యః
నిర్వికల్పః సచ్చిదానంద స్వరూపః మాయాశూన్యః అకర్తా

అభోక్తా పచమాయు యా వచ్ఛిన్నత్వా త్రిగుణః సవి
కల్పః సూత్రాత్మా త్రిమూర్తి స్వరూపః దేహీ చాసీత్
ఓమిత్యేకాక్షరం బ్రహ్మ ప్రజ్ఞానం బ్రహ్మ అహం బ్రహ్మాస్మి
తత్త్వమసి అయమాత్మా బ్రహ్మేత్యాది మహావాక్య లక్ష్యార్థ
గోచరో దేవల ఏవ.

తా॥ ఆ దేవల బ్రహ్మయే ఊర్ధ్వరేతస్కుడగుచు బ్రహ్మ
చర్యమున విలసిల్లువాడు. గుణరహితుడు, నిష్కళంకములేనివాడు,
శాశ్వతుడు, వికల్పములు లేనివాడు, మాయారహితుడు, సచ్చిదా
నంద స్వరూపుడై మాయనంటక మాయాతీతుడై ప్రకా
శించును. అట్లయ్యును తన మాయచేత నామరూపాది వికల్ప
ములు వహించి, సగుణుడై జగన్నాటక సూత్రధారియై బ్రహ్మ
విష్ణు మహేశ్వర రూపములతో లోకాల సృష్టిస్థితిలయములు
కావించుచు ఆత్మరూపమున సర్వాంతర్వర్తి యగుచుండును.
ఓమిత్యేకాక్షరం బ్రహ్మ, ప్రజ్ఞానం బ్రహ్మ, అహం బ్రహ్మాస్మి,
తత్త్వమసి, అయమాత్మా బ్రహ్మ, ఇత్యాది మహావాక్యలక్ష్యార్థ
ములకు విషయ భూతుడైనవాడు దేవల బ్రహ్మయే యని
తెలియ వలయును.

౧ ఋగ్వేదమునందలి ప్రమాణము :-

జట ౧:- ఓం తదాత్మా, ఓం తజ్జగత్, ఓమితి సర్వం, తదోంకార
రూప దేవల త్వంయజ్ఞః, త్వం వషట్కారః, త్వం
ఇంద్రః, త్వం బ్రహ్మా, త్వం విష్ణుః, త్వం రుద్రః,
త్వం వాయుః, త్వమగ్నిః, త్వం చంద్రమాః ఇతి
ఋగ్వేద ప్రదర్శనాత్.

తా॥ పరమాత్మ ప్రణవస్వరూపుడు, జగములన్నియును ప్రణవస్వరూపమే; అట్టి ప్రణవస్వరూపుడవైన ఓ దేవల బ్రహ్మమా! నీవే యజ్ఞము, యజ్ఞాహుతియు నీవే, యింద్రుడవు, త్రిగుణాత్మకులయిన బ్రహ్మ విష్ణు మహేశ్వరులు నీవే. వాయువు నీవే అగ్నివి నీవే. నీవే చంద్రుడవు. నీవుగాని దేదియునులేదు.

-! సిద్ధాంత తత్త్వ ప్రకాశికయందలి ప్రమాణము !-

శ్లో॥ దేవలోయం పరబ్రహ్మ నిత్యశుద్ధాత్మ నిర్మలః
సచ్చిదానంద రూపశ్చ నిర్వికల్పో నిరామయః
కర్తృత్వాది వినిర్ముక్త స్సర్వసాక్షీ నిరాకులః
సఏవ మాయయాయుక్త స్సగుణ స్సవికల్పకః
సత్త్వాదిగుణ సంయుక్తో బ్రహ్మాద్యాకారమాయయౌ
అయంహి తత్త్వమస్యాది వాక్యలక్ష్యార్థ గోచరః
తద్రూపంహి జగత్సర్వం తదన్యం నాస్తికించన.

తా॥ ఈ దేవల బ్రహ్మయే పరమాత్మ. శాశ్వతుడు, శుద్ధుడు, నిర్మలుడు, నిరామయుడు నగుచు సచ్చిదానంద రూపమున ఏ వికల్పములు లేక ప్రకాశించుచుండును. వానికి కర్తృత్వ భోక్తృత్వాదులులేవు. నిరాకులుడై మాయనంటక లోకము లన్నింటికి సాక్షిభూతుడై యుండును, ఆ దేవల బ్రహ్మయే జగముల ఉత్పత్తిస్థితి నాశములకొఱకు తన మాయచేత సత్త్వరజస్తమో గుణములతోగూడి నామ రూపాదికములగు వికల్పములతోడ బ్రహ్మ విష్ణు మహేశ్వరాది రూపములు వహించెను. అతడే తత్త్వమస్యాది మహావాక్య లక్ష్యార్థములకు విషయభూతుడై

యుండెను. జగములన్నీ దేవలమయమే. దేవలుడుకాని యును లేదు.

-: దీనికి అథర్వణ వేదమందలి ప్రమాణము :-

శృతి :- సర్వం దేవల మామనంతి బ్రహ్మవాదినః

తా॥ సమస్త ప్రపంచమును దేవలమయమే అని బ వేత్తలు చెప్పుచున్నారు.

మూల :- పునః కల్పాదౌ వస్త్ర సూత్రాభావాత్ సర్వేదేవా నత్వా ప్రార్థయామాసుః. శివో దైవతైః ప్రా స్వయంభువందధ్యౌ. సోపి శివసహస్రార కమలాన్ని సశరీరస్సన్ దేవలనామ్నా బ్రహ్మ విష్ణు రుద్రాది దేవా సూత్రవస్త్రాదికం దత్తవాన్. తతః కాండర్షిరా దేవాంగమమం దృష్ట్వా మమ వస్త్రసూత్రాదికం దా మిత్యపృచ్ఛత్. దేవాంగ బ్రహ్మణా నేదానీం వర్తతే దీయతే ఇత్యుక్తం. తతః కాండర్షిః కుపితస్సన్ సర్వే దత్వా మమ నాస్తీత్యుక్తం అతస్త్వం నరోభవేతి శ దత్తవాన్ తతో మమ బ్రహ్మ త్వచ్ఛాపం జగదువ కార భవతి. లోకే కార్య కారణయో రభేదస్య విద్యవ త్వాత్, నరాణాం జగదంతః పాతిత్వేన సర్వస్యాపిజ బ్రహ్మ స్వరూపత్వేనచ నరస్య మమచ భేదోనాస్తి త్వద్దత్త శాపేన కింప్రయోజన మిత్యుక్త్వా శివ సహ కమలం ప్రావిశత్.

తా॥ మరొక బ్రహ్మ కల్ప ప్రారంభమున దేవతలం తమకు వస్త్రసూత్రములు లేనందున పరమేశ్వరునిజేరి నమసా

పూర్వకముగ వేడుకొనిరి, పరశివుడపుడు, తనయందు జ్యోతీ రూపమున వెలుగొందు స్వయంభువుని ధ్యానించెను. అపుడా స్వయంభువు శివ సహస్రార కమలాంతరమునుండి తేజోరూపమున వెలువడి దేవల నామముతోడ పురుషరూపము వహించి, బ్రహ్మ విష్ణు మహేశ్వరాది దేవతలందఱికి వస్త్ర సూత్రము లిచ్చెను. తరువాత కాండనామధేయుడగు మహర్షి వచ్చి నాకు గూడ వస్త్ర సూత్రము లిమ్మని యడిగెను. దేవలు డపుడు వానితో నేనివ్వడియలాలను రేపు రమ్మనెను. దానికి కాండ మహర్షి కోపించి అందఱికి వస్త్ర సూత్రము లిప్పుడే యిచ్చి నన్ను రేపు రమ్మందువాయని నీవు భూలోకమున మనుష్యుడవై జన్మింతువుగాక యని శపించెను. అంతట దేవలబ్రహ్మ, కాండ మహర్షితో నాకు నీ విచ్చిన శాపము లోకోపకారమునకు గానగుచున్నది. లోకమున కార్యమగు ప్రపంచమునకును గారణమగు పరబ్రహ్మమునకును భేదము లేనందున మానవులు ప్రపంచములోనె చేరిన వారగుటచేతను, ప్రపంచమంతయు పరబ్రహ్మ స్వరూపమే యగుటచేతను మనుష్యునకు నాకు భేదములేదు. కనుక, నీ విచ్చిన శాపమున మేలు కలిగెనేకాని కీడుగాదు. అని చెప్పి పరశివ సహస్రార పద్మాంతరాళము ప్రవేశించెను.

–: దీనికి తత్త్వ సారోపనిషత్ప్రమాణము :–

శ్లో॥ కల్పాదౌ వస్త్ర సూత్రాది మభావా న్నిర్జరాః పునః
శివం సంప్రార్థ యామాసుః లజ్జావనతమ స్తకాః
తత స్స్వయంభువం దధ్యౌ వస్త్ర సూత్రార్థ మీశ్వరః
త్యక్త్వా సోపి సహస్రారం బహిరాగత్య సాదరం
సదేహ దేవలాభిఖ్యాం ధృత్వా సౌవిబుధైస్తుతః

నిర్మాయ సూత్ర వస్త్రాదీన్ దేవతానాందదౌ ముదా
కాండర్షి స్తత ఆగత్య నత్వా దేవాంగ మీశ్వరం
యయాచ సూత్రవస్త్రాదీన్ మమదేహీతి భక్తితః
ఇతీరితం వచశ్శృత్వా దేవాంగో మునినా తదా
నేదానీం వర్తతే బ్రహ్మన్ సూత్రవస్త్రాదికం త్వహం
శ్వస్తేదాస్యామి గచ్ఛేతి ప్రోక్తవాన్ దేవతాధిపః
తత స్తద్వచనం శ్రుత్వా కుపితో మునిపుంగవః
సూత్రవస్త్ర ప్రదత్వాన్య సర్వేషా మమృతాంధసాం
అబ్రవీర్మమి నాస్తీతి యస్మా న్నిష్క్రపయాఽధునా
నరోభవేతి దేవాంగం శశాప సురపూజితం
తతో మునివరం దృష్ట్వా దేవాంగః ప్రహసన్ ముదా
ఉవాచ మునిశార్దూల త్వచ్ఛాపం జగతాం భృశం
ఉపకారాయభవతి నాత్రకార్య విచారణా
ఖేదో నదృశ్యతే విద్వన్ యత్కించి జ్జగదాయయోః
మత్స్వరూపం జగత్సర్వం జగన్మద్రూప మేవహి
నరాణాంచాపి మే విద్వన్ యోగ్యవేవ న సంశయః
ఇత్యుక్త్వాంతరధా ద్దేవో దేవాంగో జగదీశ్వరః.

తా॥ మఱొక కల్పారంభమునందు మరల దేవతలు సూత్ర వస్త్రములు లేక సిగ్గుచే తలలు వంచుకొని పరశివుని మిక్కిలి ప్రార్థించిరి. పరశివు డపుడు సూత్ర వస్త్రములకొఱకు స్వయంభు వగు పరమాత్మను ధ్యానించెను. ఆ స్వయంభువు శివ సహస్రా రమునుండి వెలువడి, ఆదరముతోడ దేహధారియై దేవలుడను పేర దేవతలు స్తుతించుచుండ సూత్ర వస్త్రములు నిర్మించి సంతోషముగ దేవతలందఱి కిచ్చెను. అప్పుడే కాండమహర్షి వచ్చి ప్రభుడగు దేవాంగునకు నమస్కరించి, నాకుకూడ సూత్ర వస్త్రము

నిమ్మని భక్తితో వేడుకొనెను. దేవలు డప్పుడా మహర్షినిజూచి మహర్షీ! నీ కిప్పుడే మాత్రి వస్త్రము లీయజాలను రేపిచ్చెద రమ్మనెను. కాండ మహర్షి, కోపించి ఇప్పుడే దేవతలందఱి కిచ్చి నన్నుమాత్రము దయలేక రేపురమ్మనుచుంటివి కనుక, నీవు భూలోకమున మనుష్యుడవై జన్మింపుమని శపించెను. దేవలబ్రహ్మ, తన్నిట్లు మహర్షి శపించి నందులకు సంతోషముతో నవ్వుచు మునిశార్దూలా! నీ విచ్చిన శాపము లోకమునకు మిక్కిలి యుపకారము కలిగించునదిగనే యున్నది. దీనికి నే నేమీ బాధ పడుటలేదు పండితుడా! లోకమునకును, నాకును భేదమేమీలేదు. ఈ లోకమంతయు నా స్వరూపమే. నేనును ఈ జగత్స్వరూపమే. కనుక, నీ విచ్చిన శాపము యోగ్యమైనదియే సందేహము లేను. అని చెప్పి దేవలబ్రహ్మ అప్పుడే అంతర్ధానము నొందెను.

శ్లో॥ వేదాః ప్రమాణం ప్రథమం స్మృతఏవ న సంశయః<br>
స్మృతయ శ్చేతిహాసాని పురాణానిచ షణ్ముఖ<br>
వేదా ఽవిరోధా దేతాని ప్రమాణాని న సంశయః<br>
బ్రాహ్మం పాద్మం వైష్ణవంచ శైవం భాగవతాభిదం<br>
మార్కండేయం నారదీయ మాగ్నేయ మితికీర్తితం<br>
భవిష్య ద్బ్రహ్మవైవర్తం లైంగ్యం వారాహ మేవచ<br>
స్కాందం వామన కూర్మాఖ్యం మాత్స్యం గారుడసంజ్ఞికం<br>
బ్రహ్మాండాఖ్య పురాణంచ వ్యాసోక్తం శ్రుతి సమ్మతం<br>
శైవం స్కాందం తథాలైంగ్యం కూర్మం వామన సంజ్ఞికం<br>
భవిష్యం మత్స్య వారాహం మార్కండేయం తథైవచ<br>
బ్రహ్మాండంచ దశైతాని శైవాని సురసత్తమ<br>
నారదీయం భాగవతం గారుడం వైష్ణవాభిదం

ఏతచ్చతుష్టయం విష్ణు పురాణాని మహామతే
బ్రాహ్మం పాద్మం ద్వయంబ్రహ్మ పురాణ మితికథ్యతే
బ్రహ్మకైవర్త మేకంతు పురాణం సూర్యబోధకం
ఆగ్నేయాఖ్యం మహాప్రాజ్ఞ పురాణం త్వగ్ని బోధకం
రామాయణం భారతంచ వాల్మీకే ర్వ్యాసనిర్మితం
ఇతిహాసా విమౌ పూర్వరాజ వృత్తాంత బోధకౌ
పురాణే ష్వితిహాసేషు తత్ర తత్రచ షణ్ముఖ
దేవాంగముని మాహాత్మ్యం విద్యతే శ్రుతి సమ్మతమ్.

తా॥ ఓ షణ్ముఖా! తత్త్వార్థ నిర్ధారణకు మొదట వేదములే స్వతస్సిద్ధముగ ప్రమాణములు. శాస్త్ర పురాణేతి హాసములును వేద విరుద్ధములు కానందున అవియును ప్రమాణములగుట కే మాత్రము సందేహములేదు. బ్రాహ్మము, పాద్మము, శైవము, భాగవతము, మార్కండేయము, నారదీయము, ఆగ్నేయము, భవిష్యము, బ్రహ్మకైవర్తము, లైంగ్యము, వారాహము, స్కాందము, వామనము, కూర్మము, మాత్స్యము, గారుడము, బ్రహ్మాండము అను నీ పదు నెనిమిది పురాణములు వ్యాసమహర్షి రచించెను. ఈపదునెనిమిది పురాణములలో శైవము, స్కాందము, లైంగ్యము, కూర్మము, వామనము, మాత్స్యము, వారాహము, మార్కండేయము, బ్రహ్మాండము అను నీ పది పురాణములు శివ ప్రబోధకములు. నారదీయము, గారుడము, భాగవతము, వైష్ణవము అను నీ నాల్గు పురాణములు విష్ణు ప్రబోధకములు. బ్రాహ్మము, పాద్మము అను నీ రెండు పురాణములు బ్రహ్మప్రబోధకములు. బ్రహ్మకైవర్త పురాణము సూర్య ప్రబోధకము, ఆగ్నేయ పురాణము అగ్ని బోధకము. వాల్మీకి మహర్షి రచించిన

రామాయణము, వ్యాసమహర్షి రచించిన భారతము. ఈ రెండును పూర్వరాజచరిత్రముల దెలుపు ఇతిహాసములు వేదశాస్త్రములందే గాక, పురాణేతిహాసము లందునూ అక్కడక్కడ దేవలబ్రహ్మ మాహాత్మ్యమును గురించి చెప్పబడియున్నది. అని శివుడు, కుమారస్వామికి జెప్పెను.

షణ్ముఖ :- దేవాంగ సంభవేమానం వదమే కరుణాకర శ్రుతిస్మృ
త్యవిరోధేన బ్రహ్మ విష్ణ్వాది పూజిత కుమారవచనం
శ్రుత్వా మహేశో హృష్ట మానసః తాన్యేవ శ్రుతివాక్యాని
దైవలానిత్థ ముక్తవాన్.

తా॥ కుమారస్వామి, తండ్రియగు శివునిజూచి, బ్రహ్మ విష్ణ్వాది పూజితా! కరుణాకరా! దేవాంగ తత్త్వార్థ బోధకములగు విషయములను వేదశాస్త్ర సమ్మతములగు ప్రమాణములను నాకు జెప్ప వలసినదని అడిగిన కుమారస్వామి మాటలకు శివుడు, సంతోషించి, దేవలబ్రహ్మ విషయమైన ఆ వేద ప్రమాణ వాక్యములనే యిట్లు చెప్పెను.

జట :- దేవలా దిమాని భూతాని జాయంతే. దేవలేన జాతాని
జీవంతి దేవలం ప్రత్యభి సంవిశంతి. తస్మాద్దేవలో
భూతానా మగ్ర ఆసీ దితి సామవేద ప్రదర్శనాత్.

తా॥ పృథివ్యప్తేజో వాయ్వాకాశాదిక సమస్త జంగమ స్థావరములన్నియును దేవలుని వలననే జన్మించి, దేవలుని వలననే జీవించి, దేవలునియందే కలిసిపోవుచున్నవి. కనుక, దేవలుడే సమస్త భూతములకు ప్రధాన పురుషుడు. అని సామ వేద నిరూపణము.

జట :- హిరణ్యగర్భా దగ్రే సమవర్తత సర్వస్యభూతస్య పతి రేక ఏవ దేవలః, యతేంద్రో బృహస్పతి ర్దేవా సూర్యా చంద్రమసౌ దేవల మయుజంత తస్మా ద్దేవలో దేవతాద్య శ్చాస్త్రాచ దేవతానాం బ్రహ్మణశ్చేతి యజుర్వేద ప్రదర్శ నాత్.

తా॥ బ్రహ్మకంటె ముందు సమస్త భూతాధి నాథుడగుచు దేవలు డొక్కడే సనాతనుడై యుండెను. ఇంద్రుడు, బృహస్పతి, దేవతలు, సూర్యచంద్రులు దేవలునే పూజించుచున్నారు. కనుక, దేవలబ్రహ్మయే బ్రహ్మాది దేవతలందరికీ ప్రభుండును ఆది పురు షుండు నని యజుర్వేద నిరూపణము.

జట :- మనసావాచావదంతి సత్యం దేవాంగం దేవతాయజ్ఞభుజం యజ్ఞకర్తారం యజ్ఞరూపం విశ్వస్యభర్తారం గోప్తారం హర్తారం తస్యరూప మేవై తత్సర్వం సూత్రకర్తార మాహుః- ప్రజాపతి స్తపసా తప్త్వా దేవాంగ మబ్రవత్ ఇమాన్ లోకాన్ కథంవై సృజామీతి - ఇతి సామవేద ప్రదర్శనాత్.

తా॥ దేవతలందఱును దేవాంగ బ్రహ్మనుగూర్చి మనస్సు చేతను మాటలచేతను యజ్ఞభోక్తయనియును, యజ్ఞాధికారి యనియును, యజ్ఞస్వరూపుడనియును, సమస్తమునకు అధి పతి యనియును, రక్షకుడనియును, లయకర్త యనియును, ఈ సమస్తము నాతని రూపమే యనియును, సత్యమునే చెప్పు చున్నారు. సూత్రకర్త యనియును చెప్పుచున్నారు. బ్రహ్మ దేవుడు తపస్సుచేసి దేవల బ్రహ్మను, ఈ లోకముల నెట్లు సృజింతును. అని అడిగెనని సామవేద నిరూపణము.

జట ॥- అగ్ని రగ్నేః ప్రథమో దేవతానాం అగ్నేర్దేవానాం ప్రథము స్సూర్యః, అగ్నిర్దేవతా సూర్యాంతరాత్మా జగత స్తస్థుషశ్చ దేవాంగో బ్రాహ్మణా స్తంనమంతి బ్రహ్మవాదినః ఇతి యజుర్వేద ప్రదర్శనాత్.

తా॥ దేవతలందరికి మొదటివాడు అగ్నిహోత్రుడు. ఆ అగ్నిహోత్రునకును దేవతలకును ప్రధానుడు సూర్యుడు. అట్టి సూర్యాగ్ని హోత్రులకును, స్థావరజంగ మాత్మకముగా దృశ్య మానమగు నీ సమస్త ప్రపంచమునకును అంతరాత్మయై ప్రకా శించు పరమాత్మయే దేవలబ్రహ్మ. కనుకనే బ్రహ్మ జ్ఞానసంపన్ను లగు బ్రాహ్మణులు, ఆ దేవల బ్రహ్మను గూర్చి నమస్కరించు చున్నారు. అని యజుర్వేద నిరూపణము.

శ్రుతి ॥- ఏక ఏవహి దేవాంగః, స బ్రహ్మ, తత్సత్యం, పృథ్వీ మిథ్యా, సూత్రాత్మనో దేవల బ్రహ్మణస్సకాశా దవ్యక్తం, అవ్యక్తాన్మహత్, మహతో అహంకారః, అహంకారాదాకాశః, ఆకాశాద్వాయుః, వాయోరగ్నిః, అగ్నేరాపః, అద్భ్యః పృథివీ, పృథివ్యా ఓషధయః, ఓషధీభ్యోఽన్నం, తన్మ త్సర్వ కారణో దేవాంగః - ఇతి ఋగ్వేద ప్రదర్శనాత్.

తా॥ దృశ్యమాన ప్రపంచ సృష్టికి ముందు దేవాంగ బ్రహ్మ యొక్కడే అఖండాద్వితీయ పరిపూర్ణ బ్రహ్మమై ప్రకా శించుచుండెను. ఆతడే పరాత్పరుడు, ఇది సత్యమైన విషయము. ప్రపంచము మాయ. సూత్రాత్మకుడయిన దేవలబ్రహ్మ మూల మున అవ్యక్తము జనించెను. దానినుండి మహత్తు కలిగెను, ఆ మహత్తత్త్వమునుండి ఆకాశమేర్పడెను, ఆకాశమునుండి

వాయువేర్పడెను. వాయువునుండి అగ్నియు, అగ్నినుండి జలము, జలమునుండి భూమి, భూమినుండి ఓషధులు, ఓషధుల నుండి అన్నము, క్రమముగా జరించినవి. కనుక, సమస్తము నకు దేవల బ్రహ్మయే కారణభూతుడు. అని ఋగ్వేద నిరూపణము,

శృతి :- ఓంకారరూపిణో దేవలస్య ప్రకృతేః రజస్సత్వ తమో గుణాః, బ్రహ్మ విష్ణు రుద్రాః బభూవుః. బ్రహ్మా కామయత ప్రజాస్సృజేయేతి. సబ్రహ్మా తప స్తప్త్వా యోవై బ్రహ్మాణం ప్రదదౌచ వేదాన్ తం దేవలం శరణ మహంప్రపద్యే. ఇతి తత్త్వరహస్యోపనిషత్ప్రదర్శనాత్.

తా॥ ప్రణవస్వరూపు డయిన దేవలబ్రహ్మయొక్క మాయ వలన రజస్సత్వతమో గుణాత్మకులగు బ్రహ్మ విష్ణు మహేశ్వరు లుదయించిరి. రజోగుణయుతుడగు బ్రహ్మదేవుడు లోకసృష్టి చేయ వలయునని అందులకు దగిన సాధనములకొఱకు తపస్సు చేసెను. దేవల డపుడు ప్రత్యక్షమై బ్రహ్మదేవునకు లోకోత్పత్తి సాధన భూతములగు వేదము లనుగ్రహించెను. అట్టి పరాత్పరు డగు దేవలబ్రహ్మయే నాకు రక్షకు డగుగాక యని తత్త్వరహస్యోప నిషత్ప్రమాణము.

శృతి :- దివ్యోఽగ్ని రేకో దేవలః. సబ్రహ్మ, సవివాగ్ర ఆసీత్. సవై తంతు కర్తా భవత్. విశ్వకర్మణే ప్రాయచ్ఛత్తం తూన్ సదేవాంగో దేవానామయచ్ఛత్సూత్రాణి - తంసర్వే దేవానమంతి. సోఽగ్నిమసృజత్. ఇమాన్లోకా వసృజత్. ఇంద్రమసృజత్. వాయుమసృజత్. అన్నం వై దేవలో౽

న్నాదో దేవలః. సచంద్రమా స్వనక్షత్రైః సదివానక్తం ద్యౌరంతరిక్షం దిశ స్సోస్మాన్ పాతు. సదిశః పాతు సోఖిలాత్మానందీ భవతీతి సామవేద ప్రవర్మనాత్.

తా॥ దేవలబ్రహ్మ యొకడే చిజ్జ్యోతిస్స్వరూపుడు. అతడే సృష్టికిముందు సచ్చిదానందాఖండ పరిపూర్ణ పరబ్రహ్మము. అతడే లోక పరిమాణ సాధన భూతములగు తంతువులు నిర్మించెను. ఆ తంతువులను విశ్వకర్మ కిచ్చినదియు ఆ దేవల బ్రహ్మయే. బ్రాహ్మణ్య సంపాదకములగు బ్రహ్మ సూత్రములను దేవతల కొసగినదియు ఆ దేవల బ్రహ్మయే. అట్టి విరాట్పురుషుడగు దేవలబ్రహ్మకే దేవతలందఱును నమస్కరించుచున్నారు. ఈ లోకము లన్నిటిని అతడే సృజించెను. ఇంద్రాది దేవతలను, అగ్నివాయ్వాకాశాదికములగు పంచభూతములను, సూర్యచంద్ర నక్షత్రాదులను, ఆ దేవల బ్రహ్మయే సృజించెను. దివారాత్రములు, స్వర్గాకాశములు, దిశలు ఇవన్నీ ఆ దేవలుడే. అతడు సర్వాత్మకుడు సచ్చిదానందమయుడు. ఆ దేవలబ్రహ్మ మనలను సకల లోకములను రక్షించుమగాక! అని సామవేద ప్రమాణము.

శ్రుతి :- సదేవలో బ్రాహ్మీవీణాయై శతతంతుదాతా. సతుచిరభ్రవతు. సూత్రదాతా సబ్రహ్మభవతి సవిచార్యః తస్య సూత్రాదన్న ప్రాణో మనశ్చక్షుశ్శ్రోత్ర మజీజనత్. తత్స్వరూపం జగత్. స ఆత్మా తత్పత్యం, తంతోర్వా లఖిల్యా అజాయంత. త్రై బ్రాహ్మణ్యం. సవై విశ్వరూపో, నదివా నరాత్రి ర్నద్యౌః సనక్షత్రాదీ ననభోదిశః కేవలం సూత్రాత్మా సర్వందేవలో, దేవతాస్సర్వే దేవలం ప్రవిశంతి, సరుద్రాంతర్యా మ్యోంకారరూపః, సర్వభూతాంత

రాత్మా అపహతపాప్మా. యదక్షర మిదం బ్రహ్మ తత్సూత్రం జ్ఞానదాయకం సూచనాత్సూత్ర మిత్యాహు స్సూత్రంతై పరమంపదం, తత్సూత్రం విదితం యేన సయోగినాత్ర సంశయః. ఏకోదేవ స్సర్వభూతేషుగూఢః. సర్వవ్యాపి సర్వభూతాంతరాత్మా, కర్మాధ్యక్ష స్సర్వభూతాధివాసః, సాక్షి చేతో దేవలో సూత్రరూపః. ఇతితత్త్వసారోపని షద్దర్శనాత్.

తా॥ ఆ దేవలుడే సరస్వతీదేవి వీణకు సూత్రతంతువులిచ్చిన వాడు. శుచిర్భూతుడును సూత్ర దాయకుడునగు ఆ దేవలుడే పరబ్రహ్మ స్వరూపుడు, అతడే విషయ పరిశీలనముచేత దెలిసికొ దగినవాడు. అతని సూత్రములవలననే అన్న ప్రాణములును, మనస్సు బుద్ధి మొదలగు అంతఃకరణములును, చెవులు కన్నులు మొదలగు ఇంద్రియములును జనించెను. జగమంతయు దేవలి స్వరూపమే. అతడే ఆత్మమయుడు ఇది సత్యము. ఆ దేవలుని సూత్రముల వలననే వాలఖిల్యాది బ్రహ్మర్షులు జన్మించిరి. ఆ సూత్రములచేతనే బ్రాహ్మణ్య మేర్పడును. కనుక దేవలుడే విశ్వమయుడు. దివారాత్రములేకాదు, స్వర్గాకాశములేకాదు, దిక్కులు నక్షత్రాదులేకాదు మరి అన్నియును తానే యగుచు సూత్రాత్ముడై విలసిల్లువాడు దేవల బ్రహ్మయే. దేవతలందరును దేవలునియందే కలిసిపోవుచున్నారు. దేవలుడే రుద్రుని యందంతర్యామియై తేజోరూపమున బ్రకాశించుచుండును. దేవలుడే ప్రణవాత్మకుడు, దోషరహితుండును, సర్వభూతాంత రాత్మయు నాతడే ఏది నాశరహితమై అఖండాత్మకమగు పర బ్రహ్మమో, అదియే సూత్రాత్మకమైనదియును, జ్ఞానరూపకంబగు

నదియును. అది అఖండానంద పరిపూర్ణ బ్రహ్మమును సూచించుట వలననే బ్రహ్మవేత్తలు దానిని సూత్రమని చెప్పుచున్నారు. ఆ సూత్రమే పరమపదము. అది తెలిసినవాడే యోగీంద్రుడు సందేహములేదు. సూత్రస్వరూపుడగు దేవుడొక్కడే పరమాత్ముడు. సర్వభూతాంతర్యామియును సర్వవ్యాపియునై సర్వ కార్యములకు నియామకుడగుచుండును. ఇట్లు దేవల బ్రహ్మ సర్వము తానే యయ్యును దేనినంటక సర్వాతీతుడగుచు సర్వ సాక్షియై ప్రకాశించుచుండును. అని తత్త్వ సారోపనిష త్ప్రమాణము.

మూల :- అథఖలు ఋగ్వేదాది విభాగేన వేదాశ్చత్వారః తత్రైక వింశతి శాఖాఋచః నవాధికశతశాఖాయజుషః సహస్ర శాఖాసామ్నః పంచాశచ్ఛాఖా అథర్వణస్య ఏకైక శాఖాయా ఏకైకోపనిషత్. అహత్యా శీతి సహిత శతాధిక సహస్ర సంఖ్యాకా ఉపనిషద :- తాసు శ్రీరామచంద్రేణ సారతరోపనిషదః అష్టోత్తర శత సంఖ్యాకా వాయుసూనవే ఉపదిష్టాః

తా॥ ఋగ్యజుస్సా మాథర్వణము అనెడు విభాగముచేత వేదములు నాలుగుగా ఏర్పడినవి. అందు ఋగ్వేదమునకు ఇరువదొక్క శాఖలును, యజుర్వేదమునకు నూటతొమ్మిది శాఖలును, సామ వేదమునకు వేయి శాఖలును, అథర్వణ వేదమునకు ఏబది శాఖలును గలవు. ఒక్కొక్క శాఖ ఒక్కొక్క ఉపనిషత్తగును. మొత్తము వేయిన్ని నూట యెనుబది ఉపనిషత్తులను శ్రీరామచంద్రుడు, ఆంజనేయున కుపదేశించెను.

-॥ దీనికి విద్యారణ్య విరచిత సర్వోపనిషత్సార సంగ్రహ ప్రమాణము ॥-

శ్లో॥ ఋగ్వేదాది విభాగేన వేదాశ్చత్వార ఈరితాః
ఏకవింశతి సంఖ్యాక శాఖా స్తత్ర రుచస్మృతాః
నవాధిక శతంశాఖా యజుషః పరికీర్తితాః
సామ్నః సహస్ర సంఖ్యాక శ్శాఖాస్సంతి విభాగతః
అథర్వణస్య పంచాశచ్ఛాఖాస్సంతి ప్రమాణతః
ఏకైకస్యాశ్చ శాఖాయా ఏకైకోపనిషత్ స్మృతా
అశీత్యుత్తరశతేనయుక్తా సాహస్ర సంఖ్యయా
విద్యంతేత్రోపనిషద శ్శుద్ధ తత్త్వార్థ బోధకాః
తత్రాచాష్టోత్తర శతసంఖ్యాకా వాయుసూనవే
ప్రోక్తం శ్రీరామచంద్రేణ సాక్షాత్సద్వస్తుసిద్ధయే
ఈశకేన కఠప్రశ్న ముండమాండూక్యతిత్తిరిః
ఐతిరీయంచ ఛాందోగ్యం బృహదారణ్యకం పశ
జాబాలం సర్వ సారంచ నిరాలంబ మహత్మకం
అద్వయావ్యక్త శారీర భావనాధ్యాత్మకం దశ
అసుముండక జాబాల నిరాలంబ కఠోమహః
ఏతా వదంతి చిన్మాత్ర పరబ్రహ్మ స్వరూపకం
ఆ పా ముఖోపనిషదః దేవలబ్రహ్మ బోధకాః
దేవలబ్రహ్మ మాహాత్మ్యం యన్నిర్గుణ నిరామయం
తద్దేవలోపనిషది నామ శాఖీయకేస్ఫుటం
దేవాంగసృతు సూత్రాది నిర్మాణం తాత్త్వికేస్ఫుటం
సూత్రవస్త్రప్రదానాది చరితం దేశికేస్ఫుటం
సప్తావతార చరితం విద్యతే వేదసారకే.

తా॥ వేదములు ఋగ్యజుస్సామాథర్వణము అని నాలుగుగా విభజింపబడినవి. అందు ఋగ్వేదమున ఇరువదొక్కటియు, యజుర్వేదమున నూట తొమ్మిదియును, సామవేదమున వేయియును, అథర్వణ వేదమున ఏబదియును శాఖలు గలవు. ఒక్కొక్కశాఖ ఒక్కొక్క ఉపనిషత్తుగ మొత్తము వేయిన్ని నూట యెనుబది ఉపనిషత్తు లేర్పడినవి. ఈ ఉపనిషత్తులన్నియును శుద్ధ తత్త్వార్థమును బోధించుచున్నవి. వీనిలో నూటెనిమిది ఉపనిషత్తులు శ్రీరామచంద్రు డాంజనేయున కుపదేశించెను. ఈ నూటెనిమిదింటిలో ఈశావాస, కేన, కఠ, ప్రశ్న, ముండక, మాండూక్య, తైత్తిరీయ, ఐతిరీయ, ఛాందోగ్య, బృహదారణ్యకములనెడు పది ఉపనిషత్తులు పూర్వదశోపనిషత్తులు. జాబాల, సర్వసార, నిరాలంబ. మహత్, శుకరహస్య, అద్వయ, అవ్యక్త, శారీరక, భావన, అధ్యాత్మకములనెడు పది ఉపనిషత్తులు ఉత్తర దశోపనిషత్తులు. పూర్వోత్తరములగు ఇరువది ఉపనిషత్తులలో జేరిన ముండక, జాబాల, నిరాలంబ, కఠ, మహోపనిషత్తుల యిదును, చిన్మాత్ర పరబ్రహ్మ బోధకములు. ఈ అయిదింటి ఉపోపనిషత్తులయిన ఉపముండక, ఉపజాబాల, ఉపనిరాలంబ, ఉపకఠ, ఉపమహోపనిషత్తులు దేవలబ్రహ్మ ప్రబోధకములగు చుండును. మరియు, నిర్గుణ నిరామయ బ్రహ్మంబగు దేవలబ్రహ్మ మాహాత్మ్యము సామవేద శాఖలో జేరిన దేవలోపనిషత్తునందు జెప్పబడినది. దేవాంగుని సూత్ర వస్త్రాది నిర్మాణ చారిత్రము శాత్ర్వికోపనిషత్తువలన స్పష్టమగు చున్నది. దేవతలకు సూత్ర వస్త్రము లొసగుట మొదలుగాగల చారిత్రము దేవలోపనిషత్తువలన దెలియుచున్నది. దేవాంగుని విద్యాధరాది సప్తావతార చారిత్రము వేద సారోపనిషత్తునందు జెప్పబడియున్నది. ఇట్లని

విద్యారణ్యస్వాములువారు సర్వోపనిషత్సార సంగ్రహమున జెప్పి యున్నారు.

॥ ఆగ్నేయపురాణాంతర్గత దేవాంగ ప్రభావము :-

ఋషయః- శ్లో॥ సూత సూత మహాప్రాజ్ఞ కోసుం దేవాంగసంజ్ఞకః
అస్మాకం వదశీఘ్రం తదిత్యూచుస్తే మహాయశాః.

తా॥ శౌనకాది మహామునులు సూత పౌరాణికునిజూచి మహా ప్రజ్ఞావంతుడవైన ఓ సూతమునీంద్రా! దేవాంగుడను పేరుగల ఆతడెవరు! అతని విషయము దెలిసికొన మిక్కిలి కుతూహల పడుచున్నాము. మాకు చెప్పవలసినదని ప్రార్థించిరి.

సూత॥ శ్లో॥ పురాతు పార్వతీనాథం నమస్కృత్యచ షణ్ముఖః
దేవాంగస్య స్వరూపంమే వక్తవ్య మితిచాబ్రవీత్.

తా॥ ఇట్లడిగిన శౌనకాదులకు సూతుడు చెప్పుచున్నాడు. ఓ మునులారా! పూర్వము కుమారస్వామి, దేవాంగ ప్రభావము నాకు జెప్పవలసినదని శివుని నమస్కార పూర్వకముగ వేడు కొనగా, శివుడు, కుమారస్వామికి జెప్పినట్లు మీకు జెప్పెద విను డని యిట్లు చెప్పెను.

శ్లో॥ శ్రుణు షణ్ముఖ సర్వజ్ఞ దేవాంగస్య స్వరూపకం
ససర్వ కార్యకర్తాచ సచ సూత్రాత్మక ప్రభుః

తా॥ సమస్తము తెలిసిన వాడవగు 'ఓ షణ్ముఖా! దేవాంగ ప్రభావము చెప్పెద వినుము. ఆ దేవాంగుడే సకల కార్యముల కధినాధుడు. సర్వలోకేశ్వరుడును, సూత్ర స్వరూపుడును ఆ దేవాంగుడే.

శ్లో॥ న పంచ పంచత త్త్వస్థః నదివా రాత్రి తారకః
న బ్రహ్మ విష్ణు రుద్రాశ్చ న నవగ్రహ సంకులమ్.

తా॥ ఆ దేవల బ్రహ్మ, ఇరువదైదు త త్త్వములతో గూడిన వాడు గాడు. రాత్రిం బవళ్లు నక్షత్రములు నంగాడు. బ్రహ్మ విష్ణు మహేశ్వరులునూ కాడు. సూర్యాది నవగ్రహ కూటమునూ గాడు.

శ్లో॥ కింతు బ్రహ్మ స్వరూపశ్చ దేవాంగో జ్యోతిరుచ్యతే
తజ్జ్యోతిస్తు స్వయంభాతి స్వేతరై ర్న ప్రకాశతే.

తా॥ మరియేమనః ఆ దేవాంగుడు, పరబ్రహ్మ స్వరూపుడు పరంజ్యోతి స్వరూపుడని చెప్పబడువాడు. ఆ జ్యోతియో స్వయం ప్రకాశ మగునదియేగాని, మరొకదానిచేత ప్రకాశించునది కాదు.

శ్లో॥ స్వయంభు ర్దేవదేవేశః పరంజ్యోతి స్సదాశుచిః
నిరాకార స్వరూపశ్చ సర్వసాక్షి నిరామయః.

తా॥ ఆ దేవల బ్రహ్మ, స్వయంభువు, దేవ దేవేశ్వరుడు. అఖండ పరిపూర్ణ చిజ్జ్యోతియై నిరాకార స్వరూపముతో, నిరామయుడై సర్వమునకు సాక్షిభూతుడై నిరంతరము ప్రకాశించుచుండును.

శ్లో॥ ఓ మిత్యేకాక్షరంబ్రహ్మ దేవాంగో భాసతే సదా
స సూత్రాత్మా పరబ్రహ్మ ప్రపంచస్యాస్య మైచ్ఛత.

తా॥ ఆ దేవాంగుడే ఓంకార స్వరూపుడగుచు, అఖండా నంద పరిపూర్ణ పరబ్రహ్మమై నిరంతరము జ్యోతీరూపమున బ్రకాశించు చుండును. సూత్ర స్వరూపుడైన ఆ పరబ్రహ్మ లోకసృష్టి చేయ వలయునని కోరికపడెను.

శ్లో॥ తేనాహంజనితః ప్రాజ్ఞ మాయయా సహితస్సదా
జగద్రూపిణి దేవాంగే తస్మిన్ సర్వం ప్రతిష్ఠితమ్.

తా॥ ప్రజ్ఞావంతుడవైన షణ్ముఖా! ఆ దేవల బ్రహ్మయొక్క సంకల్పముచేత గలిగిన మాయవలన నేను జన్మించితిని. ప్రపంచ స్వరూపుడైన ఆ దేవల బ్రహ్మయందే జంగమ స్థావర రూపంబు లగు సమస్తములును నిలిచియుండును. సమస్తమునూ దేవాంగ స్వరూపమే యగుచుండును.

శ్లో॥ ఆవయో రంతరం నాస్తి భ్రాంత్యా భేదః ప్రకల్పితః
చిన్మయే కల్పితో భేదః రజ్జౌసర్ప మతిర్యథా.

తా॥ ఆ దేవాంగ బ్రహ్మకూ నాకూ ఏ మాత్రము భేదము లేదు - భ్రాంతిచేత మా యిద్దఱికి భేదమున్నట్లు కనపడుచుండును. త్రాటియందు సర్పమను అభిప్రాయ మెట్లు భ్రాంతిచే గలుగు చుండునో, అట్లే అఖండ పరిపూర్ణ చిన్మయ బ్రహ్మమునందును భేదాభిప్రాయము కలుగుచుండును.

శ్లో॥ ఆ పాదమస్తకం ప్రాపుః భువనాని చతుర్దశ
పాదౌ తస్యతు పాతాళం పాదోర్ధ్వంతు మహాతలం
రసాతలంచ జంఘేతు జానుశ్చాపి తలాతలం
ఊరుద్వయంతు సుతలం వితలం గుహ్యభాగకం

అతలం కటిబంధేతు లోకాస్సప్త యధాక్రమం
అధోభాగేతు వర్తంతే ఊర్ధ్వలోకాధ కీర్తితః,

తా॥ ఆ దేవల త్రిహ్మ ఆ పాద మస్తకము పదునాల్గు లోకములు వ్యాపించియున్నవి. పాదములు పాతాళము, పాదముల మీద భాగము మహాతలము, పిక్కలు రసాతలము, మోకాళ్ళు తలాతలము, తొడలు సుతలము మర్మస్థానము వితలము; కటి భాగము తలము, ఇట్లు యధాక్రమముగా, అధోలోకము లేడును దేవాంగబ్రహ్మ శరీరాధో భాగమున వ్యాపించియున్నవి. ఇక ఊర్ధ్వలోకముల విధము చెప్పెదను,

శ్లో॥ భూలోకోదరమధ్యేతు, భువర్లోకస్తు నాభిష
సువర్లోకస్తు హృదయం, మహర్లోకో గళ స్తథా
జనర్లోక స్తతోవాచి, తపోలోకే లలాటకే
సత్యలోకస్తు మూర్ధాస్య భువనాని చతుర్దశ
ఏవం తద్దేహమధ్యేతు వర్తంతే తా న్యధాక్రమమ్.

తా॥ ఆ దేవల బ్రహ్మ ఉదరమధ్యము భూలోకమును, బొడ్డు భువర్లోకమును, రొమ్ము సువర్లోకమును, కంఠము మహర్లోకమును, నోరు జనర్లోకమును, నొసలు తపోలోకమును, శిరస్సు సత్యలోకమును ఈ విధముగ పదునాల్గు లోకములును, అతని శరీరమున వరుసగా వ్యాపించి యున్నవి.

శ్లో॥ చంద్రోఽస్య మనసోజాతః చక్షో సూర్యో హ్యజాయత
ముఖా దగ్ని ర్మను శ్చాపి ప్రాణాద్వాయు రజాయత.

తా॥ ఆ దేవల బ్రహ్మయొక్క మనస్సు వలన చంద్రుడు కలిగెను నేత్రముల వలన సూర్యుడు పుట్టెను. ముఖమువలన అగ్నిహోత్రుడు పుట్టెను, ప్రాణమువలన వాయువు కలిగెను.

శ్లో॥ పద్భ్యాంభూమి ర్దిశశ్శ్రోత్రా త్తథాలోకాను కల్పితం
నాభ్యాతుహ్యంతరిక్షంచ శీర్ష్ణోర్ద్యౌ స్సముపర్తత
ఈశకోటి స్తథోత్పన్నా జీవకోటి స్తథైవచ
సర్వేషాం మూలభూతో౽యం దేవాంగో దేవపూజితః.

తా॥ ఆ దేవలుని పాదముల వలన భూమియును, చెవుల వలన దిక్కులతో గూడిన సమస్తలోకములును, నాభివలన ఆకాశమును, శీర్షమువలన స్వర్గమునూ కలిగినవి. మరియు ఆయా లోకములందు వర్తించు ప్రాణికోట్లను, అట్టి ప్రాణికోట్ల రక్షణకు ప్రభువుల సమూహములునూ ఉత్పన్నములయ్యెను. కనుక, సమస్త దేవతలచేత పూజింపబడు దేవల బ్రహ్మయే సమస్తమునకు మూలమైనవాడు.

శ్లో॥ బ్రాహ్మణో మునిజాతాతు దేవజాతాతు క్షత్రియాః
వైశ్యోహ్యప్సరజాతాతు శూద్రో వై యక్షజాతిజః
చాతుర్వర్ణోపదేశేతు కారణం త్వగ్నిమానుః
సర్వేషాంతు గురుస్సాక్షా ద్దేవాంగో బ్రహ్మ సూత్రికః.

తా॥ దేవల బ్రహ్మ సృష్టియైన యీ జగత్తునందు మహర్షి కులమునుండి బ్రాహ్మణులును, దేవకులమునుండి క్షత్రియులును, గంధర్వకులమునుండి వైశ్యులును, యక్షకులమునుండి శూద్రులునూ కలిగినారు. యజ్ఞాధారభూతుడగు అగ్నిమానువును, యజ్ఞ సూత్రాధి కారియునగు దేవాంగ బ్రహ్మ, నాలుగు జాతుల వారికి తత్త్వోపదేశకర్త యగుటచేత అతడే అందరికీ సాక్షాత్తు గురుదేవుడు.

శ్లో॥ ఏవం మూర్తిధరః కల్పే లోకానాం హితకామ్యయా
గురు ర్గురూత్తమశ్చైవ దేవాంగ స్సూత్రధారకః.

తా॥ సమస్త లోకములకు సూత్రధారియగు దేవాంగ బ్రహ్మ నిర్గుణుడయ్యును, నిఖిల లోకములకు మేలుచేయు కోరిక చేత సగుణుండగుచు, ఆయా కల్పములకు అనుగుణముగ లోక లోకేశ లోకస్థాత్మకంబగు స్వరూపము వహించుచుండును.

శ్లో॥ జటామేఖలకౌపీనో భస్మాంగో బ్రహ్మసూత్రకః
పవిత్ర మక్షమాలాంచ కమండలుధరశ్శుచిః
శివ ముద్రాంకిత ధర శ్శోభమాన స్సురార్చితః
సర్వోపదేశకర్తాచ సర్వభూత హితేరతః
సర్వకార్యప్రకర్తాచ తథా సూత్రాత్మక ప్రభుః
అంతరంగేతుహ్యాత్మాసౌ బహిరంగే జగద్గురుః
సాయుజ్యే తారక బ్రహ్మ దేవాంగో జ్యోతి రుచ్యతే.

తా॥ ఆ దేవాంగుడు, జడలు మొలత్రాడు కౌపీనమూ ధరించి, విభూతి పూసి, యజ్ఞోపవీతము దర్భముద్రిక జపమాలిక జల కుండికలను దాల్చి, త్రిపుండ్ర త్రిశూలాదికములగు శైవ లాంఛనములు కలిగి శోభాయమాను డగుచు దేవతలు సేవించు చుండగా తత్త్వార్థ బోధకాచార్యుండును, సర్వభూత హితాసక్తుండును, సర్వకార్య కారణ భూతుండు నగుచు సూత్ర రూపమున విలసిల్లుచుండును. అట్టి లోకాధినాథుడు హృదయాంతరమున జీవాత్మ యనియును, బాహ్యరంగమున జగదాచార్యుడనియును, సహయోగమున తారకబ్రహ్మయనియును, అఖండ పరిపూర్ణానంద పరంజ్యోతి యనియునూ చెప్పబడుచుండును.

శ్లో॥ మూర్తిత్రయ స్వరూపోయం దేవాంగ స్సూత్రధారకః
ఓ మిత్యేకాక్షరం బ్రహ్మం వాచ్యకో భాసతే స్వయం
ప్రణవో బీజరూపస్తు పరమాత్మా సదాశివః.

తా॥ త్రిమూర్తి స్వరూపుడు, బ్రహ్మ సూత్రధారి, "ఓమిత్యే కాక్షరం బ్రహ్మ" అను మహా వాక్యమునకు వాచ్యభూతుడు ప్రణవ స్వరూపుడు, సర్వలోకోత్పత్తికి బీజాత్మకుడు, పరమాత్మ, సదాశివుడూ అగు ఈ దేవల బ్రహ్మ సర్వము తానే యగుచు స్వయముగ ప్రకాశించుచుండును.

శ్లో॥ ఆత్మత్రయ స్వరూపేణ ఆదిశక్తి సమన్వితః
స్వయంభు ర్దేవదేవేశః దేవాంగో దివ్యమూర్తిభాక్.

తా॥ స్వయంభువును, ఆదిశక్తి సమన్వితుడును, దేవ దేవే శ్వరుడును, అగు దేవలుడు జీవాత్మ పరమాత్మ అంతరాత్మల స్వరూపము తోడ తేజోమూర్తియై ప్రకాశించుచుండును.

శ్లో॥ గుణత్రయాత్మకో జ్ఞాన స్వరూపో భాసతే గురుః
చంద్రకోటి ప్రతీకాశః సూర్యకోటి సమప్రభః
శుద్ధో మాయా సమాయుక్త సూత్రాదీన్ నిర్మమే పురా
తాని సూత్రాణి దేవేభ్యః ప్రదదౌ కరుణానిధిః

తా॥ రజస్సత్వ తమోగుణ స్వరూపుడును, జ్ఞాన స్వరూ పుడును, జగదాచార్యుడు నగు దేవాంగ బ్రహ్మ, కోటి చంద్రు లతో సమానమైన వాడుగను, కోటి సూర్యుల కాంతి కలవాడుగను, ప్రకాశించుచుండును. పరిశుద్ధుడై యోగమాయతో గూడుకొన్న వాడై ఆ దేవల బ్రహ్మ, పూర్వము తాను నిర్మించిన యజ్ఞ సూత్రాదులను దయతో దేవతల కొసగెను.

వేదోక్త మూల స్తంభనము

శ్లో॥ తమోరూపయుతో విష్ణు సహస్రారే ప్రకాశతే
నానావతార రూపేణ జగతాం హితకామ్యయా
దుష్టదైత్యాదికాన్ హత్వా సుజనాన్ పరిపాల్యచ
భాసతే సౌ మహాతేజా దేవాంగో దేవ వందితః.

తా॥ మహాతేజస్సంపన్నుడును, దేవపూజితుండు నగు దేవాంగ బ్రహ్మ, లోకములకు మేలుచేయు తలంపుతో తమోగుణ ప్రధానుడై శ్రీ మహావిష్ణు సహస్రారమున విలసిల్లి మత్స్య కూర్మవరాహాదులగు అవతారములు ధరించి దుష్టులగు రాక్షసు లను సంహరించి శిష్ట పాలనము చేయుటకు కేశవ మాధవాది నామములతో నొప్పుచుండును,

శ్లో॥ బ్రహ్మణస్స సహస్రారే రజసా వ్యాప్యనిర్మలః
చరా చరాత్మ కస్యాస్య కర్తా భూల్లోక సంతతే.

తా॥ పరిశుద్ధుడైన ఆ దేవల బ్రహ్మ రజోగుణ ప్రధాను డగుచు బ్రహ్మదేవుని సహస్రారమున వ్యాపించి, ఈ జంగమ స్థావర రూపమగు సమస్త లోకమునకు సృష్టికర్త యయి యుండెను.

శ్లో॥ తథా సత్త్వగుణేనాసౌ దేవాంగో దేవవందితః
సహస్రారం ప్రవిశ్యాస్య శివస్య పరమాత్మనః
శుకాది మునిబృందస్య బ్రహ్మవిద్యా ప్రదాయకః
దక్షిణామూర్తి రూపేణ పరావర మహౌజసా
జ్ఞానముద్రాం చాక్షమాలాం దధానో జగదీశ్వరః
శుద్ధ జ్ఞాన ప్రదాతాభూత్ తథా తామస సంయుతః
బ్రహ్మణాసృష్ట మఖిలం కురుతేహి జగల్లయః.

తా॥ దేవ పూజితుడును జగత్ప్రభువునగు దేవల బ్రహ్మ, సత్త్వగుణ ప్రధానుడై శివ సహస్రారమున బ్రవేశించి, దివ్య తేజో విరాజితమగు దక్షిణామూర్తి రూపమున జ్ఞానముద్రా జప మాలలు ధరించి శుకుడు మొదలైన మహర్షులకు బ్రహ్మ విద్యోప దేశకుండయ్యెను, అట్లే తామసగుణ ప్రధానుడై ఆ శంకరుని యందే విలసిల్లుచు బ్రహ్మ నిర్మితములగు లోకము లన్నిటికి లయము కలిగించుచుండును.

-: గాయత్రీ ప్రధానము :-

షణ్ముఖః – శ్లో॥ దేవదేవ మహాప్రాజ్ఞ వదమే కరుణాకర
యజ్ఞోపవీత మాహాత్మ్యం దేవాంగ బ్రహ్మణో ముదా.

తా॥ అట్లు దేవల తత్త్వ మెఱిగించిన తరువాత కుమార స్వామి శివునిజూచి, దేవేశ్వరా! మహాప్రాజ్ఞ! కారుణ్యనిధీ! దేవాంగ బ్రహ్మచేత నిర్మితమైన యజ్ఞోపవీత మాహాత్మ్యమును నాకు జెప్పవలసినదని ప్రార్థించెను.

శివ :- శ్లో॥ తం తు త్రయేణ సంయుక్త ముపవీతం ప్రకల్పితం
గాయత్రీ త్రిపదాసాతు దేవాంగే నైవ నిర్మితా
వదామి తస్య మానంతు శ్రుణు షణ్ముఖ సాదరమ్.

తా॥ అట్లడిగిన కుమారస్వామితో శంకరుడు, ఓ షణ్ముఖా యజ్ఞోపవీతము మూడు తంతువులతో గల్పింపబడినది. దాని కధిష్ఠాన భూతయగు గాయత్రియు మూడు పాదములతో గూడి వడిగ దేవాంగ బ్రహ్మచేతనే నిర్మింపబడినది. అట్టి యజ్ఞోపవీత ప్రమాణమును తెలిపెదను శ్రద్ధతో వినుము.

శ్లో॥ దేవ దేవ మహాప్రాజ్ఞో దేవాంగో దేవపూజితః
గాయత్రీం మందగమనాం దృష్ట్వా కరుణయా తదా
చకార త్రిపదాం దేవీం దేవేశో జగదీశ్వరీమ్.

తా॥ దేవ దేవుడు దేవ పూజితుడు, మహా విజ్ఞాన సంపన్నుడు, అగు దేవాంగ బ్రహ్మ, లోకేశ్వరియు, మందగమనయూ అగు గాయత్రీ దేవినిజూచి, దయతోగూడిన మనస్సు గలవాడై యజ్ఞోపవీతమున కధిష్ఠాన భూతయగుట కనుగుణముగ త్రిపాదగా విలసిల్లునట్లు చేసెను.

శ్లో॥ తత స్తాంత్రిపదాం దేవీం దృష్ట్వా ప్రోవాచ దేవలః
దేవి త్వం భువనం గత్వా యేతు బ్రహ్మకులోద్భవాః
తేషాం బ్రాహ్మణ్యసిద్ధ్యర్థం సూత్రరూపేణత త్తనుం
ప్రావ్య సర్వజగత్పూజ్యాన్ తాన్కురుష్వ మదాజ్ఞయా
తతో దేవాంగవచనం శ్రుత్వా సా పరమేశ్వరీ
తదాజ్ఞాం శిరసాధృత్వా దేవాంగం ప్రత్యువాచహ.

తా॥ అట్లు త్రిపాదయగు గాయత్రీదేవిని గాంచి, దేవల బ్రహ్మ, ఓ దేవీ! నీవు నా ఆజ్ఞ ననుసరించి, భూలోకమునకేగి, అచట బ్రాహ్మణ కులోద్భవులకు బ్రాహ్మణ్యము కలుగుటకు వారి దేహమున యజ్ఞోపవీత రూపమునజేరి వారలను లోకపూజ్యులనుగా జేయుము అనిచెప్పెను. ఆ పరమేశ్వరియైన గాయత్రీ దేవియు దేవలాజ్ఞను శిరసావహించి, ఇట్లు ప్రత్యుత్తరించెను.

-: యజుర్వేదోత్తర భాగమునందలి ప్రమాణము :-

జట :- యో సౌ దేవాంగో దేవరాట్ గాయత్రీం యజ్ఞోపవీతగ్ం
త్రిపదాం త్రిసూత్రమాచకార. తతో బ్రాహ్మణా వాం
బ్రాహ్మణ్యార్థం యజ్ఞోపవీతం పరమం వదంతి.

తా॥ దేవ ప్రభుడైన ఆ దేవాంగ బ్రహ్మ, గాయత్రి యజ్ఞోపవీతములకు పరస్పరము ఆధారాధేయములు గనగునట్లు గాయత్రికి మూడు పాదములు గలదిగను, యజ్ఞోపవీతమును మూడు సూత్రములు గలదిగను నిర్మించెను. అప్పుడు బ్రాహ్మణులకు, బ్రాహ్మణ్య సాధనముగ యజ్ఞోపవీతము ప్రధానమైనదిగ జెప్పబడుచున్నది.

శ్లో॥ దేవాంగ దేవతారాధ్య సృష్టిస్థిత్యంత కారణ
భూలోకే విద్యతే సర్వే మనుష్యా స్స్వేన కర్మణా
తేషు కే బ్రాహ్మణా స్తేషాం దేహం ప్రాప్య వసామ్యహం
ఇతి మే సంశయో జాతః తన్నివృత్తిం కురుప్రభో॥

తా॥ సృష్టిస్థితి లయములకు మూల కారణుడవును, దేవతల చేత ఆరాధింపబడు వాడవు నగు, ఓ దేవల ప్రభూః భూలోకము నందలి మానవులందరు వారి వారి పనులందు వర్తిల్లుచుందురు. వారిలో బ్రాహ్మణు లెవరని తెలిసికొన నగునో? యజ్ఞోప వీత రూపమున ఎవరి దేహమున వసింపవచ్చునో? అని నాకు సందేహము కలుగుచున్నది. అది నివారింపుమని అడిగెను.

శ్లో॥ స తస్యా వచనం శ్రుత్వా గాయత్ర్యా శ్రుతి సమ్మతం
సంతోషేణ పునః ప్రాహ దేవాంగో సౌ జగత్ప్రభుః.

తా॥ అట్లు గాయత్రి అడిగిన వేద సమ్మత వాక్యమును విని జగత్తునకు ప్రభువైన దేవల బ్రహ్మ సంతోష పూర్వకముగ ఆమెకు సమాధానము చెప్పెను.

శ్లో॥ దేవ దేవి మహాప్రాజ్ఞే సచ్చిదానంద రూపిణి
ప్రీతోస్మి తవవాక్యేన సాధుపృష్టం త్వయాధునా

భూమౌ ప్రాకృతవిప్రాణాం క్షత్రియాణాం విశాం తథా
తేషాం తత్కర్మ సిద్ధ్యర్థం సూత్రం కర్తుం మహేశ్వరి
సర్వేషాం మానరక్షార్థం వస్త్రం కర్తుం తథా పురా
నిర్గుణో నిరహంకారో నిర్వికల్పో హ్యహం శివే
గుణత్రయేణ సంయుక్తో హ్యభవం దేహసంయుతః
తతో దేవాంగ నామ్నాహం ప్రసిద్ధి మభుజం పురా
సత్త్వాంశేన మయాసృష్టా మద్వంశీయా మహాయశాః
తదా ప్రభృతి దేవాంగ బ్రహ్మణా ఇతి భూతలే
ప్రతీతిం ప్రాప్య వర్తంతే వస్త్రసూత్ర ప్రహేతవః
అప్రాకృతద్విజా ఏతే సర్వలోక ప్రపూజితాః.

తా॥ మహా ప్రజ్ఞాన సంపన్నవును, శక్తిజ్ఞానానంద స్వరూపవు నగు ఓ మహాదేవీ! యుక్తి యుక్తముగ నీ వడిగిన దానికి నేను పరమ ప్రీతుడనైతిని. ప్రపంచోత్పత్తికి ముందు నేను నిర్గుణుడను, నిర్వికల్పుడను, నిరహంకారుడనై యుండి లోకసృష్టి జరిగినమీదట భూమియందలి ప్రాకృత బ్రాహ్మణులకును, క్షత్రియులకును, వైశ్యులకును నియమితములైన వైదిక కర్మలందు అధికారము గలిగింపజాలిన యజ్ఞోపవీతము నిర్మించు కొనుటకను, అందఱి మానరక్షణకు జాలిన వస్త్రములను నిర్మించుటకును నేను రజస్సత్త్వతమో గుణయుతుడనై శరీరధారినై "దేవాంగుడ" నను నామమున ప్రసిద్ధి గాంచితిని. అట్టి నేను సత్త్వ గుణాంశముచేత మహాకీర్తి సంపన్నులగు నా వంశస్థులను జనింపజేసితిని. వారు లోకమున "దేవాంగ బ్రాహ్మణులు" అని ప్రసిద్ధిచెంది, సూత్ర వస్త్రములకు గారణభూతులై వర్తించు చున్నారు. వీరు కర్మయుక్తమగు ప్రాకృతమునంటక

పుట్టుకతోనే బ్రాహ్మణ్యాధికారము గలవారు. కనుక, అప్రాకృత బ్రాహ్మణులని ప్రసిద్ధులగుచు సర్వలోక పూజితులై వర్తించు చుందురు.

ఙట :- అప్రాకృతా నేతాస్త్యే వస్త్ర సూత్ర కర్తృన్ బ్రాహ్మ ణాత్ సమస్కుర్వంతి యేతే సర్వపాప్మాన మవధూన్వం తీతి యజుర్వేద ప్రదర్శనాత్.

తా॥ సూత్ర వస్త్ర నిర్మాతలయి ప్రసిద్ధిగాంచిన యీ అప్రాకృత బ్రాహ్మణుల కెవరు నమస్కరింతురో వారు సర్వ పాపములు బోగొట్టుకొందురని యజుర్వేదము నందలి ప్రమాణము.

శ్లో॥ శేషాః ప్రాకృత విప్రాస్యు స్సర్వేమునికులోద్భవాః
అప్రాకృతద్విజాతీనాం దేవాంగ కుల సంభవాః
బ్రాహ్మణ్యంతు స్వతస్సిద్ధ మేత ఛ్ఛ్రుతి మతం శుభ
తథా ప్రాకృతవిప్రాణాం సంధ్యాయాగాది కర్మభిః
బ్రాహ్మణ్యం వర్తతే తస్మా దన్యథా పతితో భవత్.

తా॥ తక్కిన ముని కులమున బుట్టిన వారందఱును ప్రాకృత బ్రాహ్మణు లనబడుదురు. అప్రాకృత బ్రాహ్మణు లయిన దేవాంగ కుల సంభవులకు సహజముగనే బ్రాహ్మణ్యము కలదనుట వేదసమ్మతమే యని తెలియుము. ముని కుల సంభవు లయిన ప్రాకృత బ్రాహ్మణులకు సంధ్యావందన వైశ్వ దేవాదికములగు వైదిక కర్మలచే బ్రాహ్మణ్యము కలుగును. ప్రాకృతులం దెవ్వ రేని ఇట్టి వైదిక కర్మ లాచరింపకుండిన వారు బ్రాహ్మణత్వము నుండి చెడినవారగుచు పతితు లగుదురు.

శ్లో॥ ఇతి జ్ఞాత్వా భువంగత్వా దేవి త్వం తత్రవాసినాం
అప్రాకృత ద్విజానాంచ తథాప్రాకృత సంజ్ఞికాం
ద్విజానాం కంఠదేశేతు వస్త్ర సూత్రాత్మనా శివే
ఇతీరితం వచశ్రుత్వా దేవాంగేన మహాత్మనా
తతో హృష్టమనా దేవీ తంప్రణమ్య ముహుర్ముహుః
దేవేశ జగదాధార బ్రహేంద్రోపేంద్ర వందిత
సురా సురేంద్ర సంపూజ్య చరణారుణ వారిజ
ధన్యాహం కృతకృత్యాహం త్వత్పాదాంబుజ దర్శనాత్
బ్రాహ్మణ్యస్య స్వరూపంతు శ్రుతం త్వత్తోమయాధునా
బ్రాహ్మణ్యవిషయే పూర్వం మచ్చిత్తోద్భూత సంశయః
న నాశ భగవన్మద్య త్వద్వాక్య శ్రవణాద్గురో
భవ దాజ్ఞా ప్రకారేణ గచ్ఛామి భువనం ప్రతి
ఇత్యుక్త్వా సామహాదేవీ జగామ స్వేచ్ఛయా తతః.

తా॥ శుభస్వరూపిణివైన ఓ గాయత్రి దేవీ! ఈ చెప్పిన
లక్షణములనుబట్టి నీవు భూలోకమునకేగి, అచ్చట అప్రాకృత
బ్రాహ్మణుల కంఠ ప్రదేశముల యజ్ఞోపవీత రూపిణివై వెలుగ
చుండుము. అని మహానుభావుడగు దేవలుడు చెప్పగా విని
గాయత్రిదేవి సంతుష్టాంతరంగయై దేవల బ్రహ్మకు మా
మాటికి నమస్కరించుచు, ఓ దేవేశ్వరా! జగదాధారా! బ్రహ్మ
ద్రాది వందితా! దేవా సురేంద్ర సంపూజితారుణ పదాంబుజా
నీ పాదపద్మ దర్శనము వలన నేమ ధన్యనైతిని. కృతకృత్యు
రాలనైతిని. బ్రాహ్మణ్య స్వరూపలక్షణము పూర్ణముగ విశ
మైనది. ఓ భగవానుడా! బ్రాహ్మణ్య విషయమున నా కిదివర
గలిగిన అనుమానము తీరిపోయినది. జగద్గురూ! నీ ఆజ్ఞా

సారముగ నేను భూలోకమున కేగుచున్నాను. అని చెప్పి ఆ గాయత్రీదేవి తన యిచ్ఛాను సారముగ బోయెను.

శివం :- శ్లో॥ యస్మాత్ షణ్ముఖ గాయత్రీ త్రిపదాభూ త్తతస్త్విదం
యజ్ఞోపవీత మపిచ త్రిసూత్రైణయుతం హ్యభూత్
ఇత్థం బ్రహ్మస్వరూపోఽయం దేవాంగో జగదీశ్వర
చకార త్రిపదాందేవీం ఉపవీతం త్రిసూత్రకం
అయమేవ పరబ్రహ్మ అయమేవ జగద్గురుః
దేవాంగేనవినాలోకే నకించి దపి విద్యతే
ఇతీరితం వచశ్ర్శుత్వా దేవ దేవస్య ధీమతః
షణ్ముఖో హృష్ట చిత్తస్సన్ ననామ పరమేశ్వరమ్.

తా॥ ఓ షణ్ముఖా! వినుము గాయత్రీ యజ్ఞోపవీతములు పరస్పరము భేదములేని రీతిగ త్రిపాద త్రిసూత్రములు గలవి యగుచుండును. పరబ్రహ్మ స్వరూపుండును, జగదీశ్వరుండు నగు దేవాంగ బ్రహ్మ. ఈ విధముగ గాయత్రీదేవిని మూడు పాదములు గలదిగను. యజ్ఞోపవీతమును మూడు సూత్రములు గలదిగను నిర్మించెను. ఈ దేవల బ్రహ్మయే పరమాత్ముండును, సర్వలోకారాధ్యుడును. సకల ప్రపంచమును దేవాంగమయమే. దేవాంగుడు కానిది మరి లేశ మాత్రమును లేదు. అని పరమేశ్వరుడు చెప్పగా విని బుద్ధిమంతుడయిన కుమారస్వామి సంతోషముతో గూడిన మనస్సుతో ఆ మహాదేవునకు నమస్కరించెను.

—సంపూర్ణము—

# :- దేవలోపనిషత్తు :-

ఇది సామవేదమున మున్నూట పదునేడవ శాఖతో చేరినది.

-: ప్రథమ ఖండః :-

జట :- అథాస్యాదౌ నిర్గుణో నిరామయో నిరంజనో నిష్క్రియో నిర్ద్వంద్వో నిర్మమో నిత్యశ్శుద్ధ శ్శాశ్వత స్సత్తామాత్రో అఖండైకరసో నిరాలంబో నిఖిల జగదు పాదానభూతో నిరాకుల స్సచ్చిదానంద నిత్య పరిపూర్ణాఽఖండ పరబ్రహ్మ స్వరూపో దేవల ఏవాసీత్ నాన్యత్కించన మిషత్.

తా॥ సృష్టికి పూర్వము నిర్గుణ, నిరామయ, నిరంజన, నిష్క్రియాత్మకుడై రాగ ద్వేషాదులగు ద్వంద్వముల నంటక మమకార అహంకార వర్జితుడును, నిత్యశుద్ధ శాశ్వత సత్తా మాత్రాదికి లక్షణములతో నిండినవాడును, నిరాలంబాఖండై కరసయుక్తుడు నగుచు సకల లోకోత్పత్తి స్థితిలయములకు హేతు భూతు డయ్యును నిరాకులుడై సచ్చిదానంద నిత్య పరిపూర్ణా ఖండ పరబ్రహ్మ స్వరూపమున దేవలబ్రహ్మ ఒక్కడే ప్రకాశించుచుండును. దేవలేతర మగునది కొంచెమేదియును లేదు.

జట:- సోఽకామయత బహుస్యామితి, దేవలాత్సదాశివోఽజాయత, దేవలాద్రుద్రోఽజాయత, దేవలా న్నారాయణోఽజాయత, దేవాలాద్బ్రహ్మాఽజాయత, దేవలాత్ప్రాణా అజాయంత, ఖంవాయు ర్జ్యోతిరాపః పృథ్వీ విశ్వా అజాయంత. మన స్సర్వేంద్రియాణిచ, దేవలాద్ద్వాదశాదిత్యా రుద్రావసవ స్సర్వాణి ఛందాంసి, దేవలా దేవసర్వాణి జగంతి

సముత్పద్యంతే, దేవలా దేవ ప్రవర్తంతే, దేవలే ప్రలీయంతే, ఏవం సర్వాణి ఛందాంసి వదంతి.

తా॥ అట్లు దేవల బ్రహ్మ, పరిపూర్ణాఖండ పరబ్రహ్మ స్వరూపుడయ్యును, అనేక రూపములతో ఖండాత్మకుడై విలసిల్ల వలయునని తలంచెను. ఆ దేవలుని వలననే సదాశివ ఉద యించెను బ్రహ్మ విష్ణు మహేశ్వరు లగు త్రిమూర్తు లుద యించిరి. ప్రాణోపానాది పంచ ప్రాణములును, పృథివ్యాది పంచ భూతములును, భూత సంయుతములగు సమస్త లోకములును దేవలుని వలననే కలిగినవి. మనస్సు బుద్ధి మొదలగు అంతః కరణములును, త్వక్కు మొదలగు జ్ఞానేంద్రియ పంచకమును, వాక్కు మొదలగు కర్మేంద్రియ పంచకములును దేవలుని వలననే యేర్పడినవి. పండ్రెండుమంది సూర్యులును, పదు నొకండుగురు రుద్రులును, ఎనమండుగురు వసువులును దేవ లుని వలననే ఉదయించిరి. సమస్త వేదములు దేవలుని వల ననే యేర్పడినవి స్థావర జంగమాత్మకములగు లోకములన్ని దేవలుని వలననే కలుగుచు, దేవలుని వలననే వర్తిల్లుచు, దేవ లుని యందే లయించుచుండును. ఇట్లని సర్వ వేదములు చెప్పు చున్నవి.

జట 1.- అథనిత్యో దేవలః శివో దేవలః రుద్రశ్చ దేవలః విష్ణుశ్చ దేవలః బ్రహ్మశ్చ దేవల - శక్రశ్చ దేవలః కాలశ్చ దేవలః దిశశ్చ దేవలః విదిశశ్చ దేవలః ఊర్ధ్వంచ దేవలః అధశ్చ దేవలః అంతర్బహిశ్చ దేవలః దేవలఏవేదగ్ం సర్వం యఏవం వేద సరుద్రో భవతి సవిష్ణుర్భవతి. సబ్రహ్మ భవతి. సహూజ్యో భవతి సనచ్చిదానందా వ్యతీము బ్రహ్మ భవతి. స సర్వం భవతీతి ప్రథము ఖండః

తా॥ ఆ దేవలుడే నిత్యుడు, సదాశివుడును దేవలుడే. బ్రహ్మ విష్ణు మహేశ్వరులూ దేవలుడే. ఇంద్రాది దిక్పాలకులును, దిక్కులూ విదిక్కులునూ దేవలుడే. కాలోపాధిక స్వరూపుడూ దేవలుడే, అధోభాగము, ఊర్ధ్వభాగము బాహ్యాంత రాభ్యంతరములును దేవలుడే. సమస్తమూ దేవలాత్మకమే. ఈ నిశ్చయార్థక మెవ డెఱుంగునో, అతడే రుద్రుడు, విష్ణు, బ్రహ్మ. సర్వలోకైక పూజితు డాతడే. అట్టివాడే సచ్చిదానందాద్వితీయ పరిపూర్ణ పరబ్రహ్మముగ ప్రకాశించును. సమస్తము నతడే యగుచున్నాడు. అని దేవలోపనిషత్తు ప్రథమ ఖండమున దెలియుచున్నది.

## ద్వితీయఖండః

జట॥- సఖలు జగత్సృష్టికామ స్స్వమాయయా రజస్సత్త్వ తమోగుణైః క్రమా ద్బ్రహ్మవిష్ణురుద్రాన్ అసృజత్ అనంతరం త్రిమూర్త్యధిష్ఠానభూతం సకలజగత్కారణం సదాశివమసృజత్, స్వస్య సర్వంతేజశ్శివే ప్రతిష్ఠాప్య సోఽద్వితీయానందస్వరూపో దేవలశ్శివసహస్రారకమలం ప్రావిశత్, అథసూత్రవస్త్రహీనై ర్బ్రహ్మాదిభి స్సంప్రార్థితశ్శివః స్వసహస్రా మధ్యగతం జ్యోతిస్స్వరూపం దేవలం ప్రార్థయామాస తదా దేవలోఽవిద్యాధిష్ఠితస్సన్ మూర్తిమాశ్రిత్య బ్రహ్మాదీనాం సూత్రవస్త్రే దత్వా శివ సహస్రారం ప్రావిశత్.

తా॥ సచ్చిదానందాద్వితీయ జ్యోతిర్మయు డగు దేవలుడు తన మాయచేత రజస్సత్త్వతమో గుణములచేత క్రమముగా బ్రహ్మ విష్ణు మహేశ్వరులను సృజించెను. తరువాత ఆ త్రిమూ

ర్తులకు అధిష్ఠాన భూతుడగు నట్లును సమస్తలోకకారణు డగు నట్లును సదాశివుని సృజించి, తన తేజస్సునంతయు నతని యందు ప్రతిష్ఠించెను. ఆ పరశివుని సహస్రారకమలాంతరముననే అద్వితీయానంద స్వరూపముతోడ ప్రవేశించెను. బ్రహ్మాదులు తమకు వస్త్ర సూత్రములు కావలసి శివుని వేడుకొనగా అతడు తన సహస్రారపద్మాంతరాళమున వెలుగుచుండు దేవలుని ధ్యానించెను. దేవలుడు తనయోగమాయచేత కరచరణాదికమగు దేహము ధరించి బ్రహ్మాదులకు సూత్రవస్త్రము లొసగి యథారీతిని సదాశివుని సహస్రార పద్మాంతరాళముననే చిజ్జ్యోతీరూపమున ప్రవేశించెను.

జట!- అథ కదాచిత్సూత్రవస్త్రాభావా ల్లజ్జాహతమానసైర్దేవై స్సంప్రార్థిత స్సదాశివ స్స్వసహస్రార మధ్యంగతంజ్యోతి స్స్వరూపం దేవలం దధ్యౌ, సోఽపి సదేహో బహిరాగత్య కిమర్థం మత్ప్రార్థనావరో భవేరితవదంతం జగదధిష్ఠాన భూతం దేవలంప్రతి పరమేశ్వరోత్యంత భక్తిపూర్వకం ప్రాహ దేవ త్వం సకల జగత్కారణ భూతః త్వచ్ఛక్త్యై బ్రహ్మదయో వయ ముత్పన్నాః పురైవ భవతాస్మాకం సూత్రవస్త్రాదికం దత్తం. ఇదానీం బ్రహ్మణా త్వదాజ్ఞా ప్రకారేణ సృష్టజగదంతర్గత దేవ మను యక్ష గంధర్వ కిన్నరకింపురుష గుహ్యక సిద్ధసాధ్య విద్యాధరాది స్వర్గ లోకవాసినః భూలోక వాసినో మనుష్యాశ్చ సూత్రాభావాత్ కర్మణ్యనధికారిణో వస్త్రాభావాల్లజ్జా సహితాశ్చ భవంతి. సూత్రవస్త్ర నిర్మాణే బ్రహ్మవ్యశక్తో హి తస్మాత్సూత్రవస్త్రకర్తా న్నిర్మాయ, సర్వదా ఏకం స్వర్గాది లోకేషు అన్యాన్ భూలోకే సంస్థాపయేతి ద్వితియఖండః

తా॥ తరువాత, కొంతకాలమునకు దేవతలు, తమకు వస్త్ర సూత్రములు లేకపోవుటచేత సిగ్గుపడి సదాశివుని ప్రార్థించిరి. సదాశివుడు, తన సహస్రారకమలాంతరాళమున జ్యోతిర్మయుడై ప్రకాశించు దేవలుని ధ్యానించెను. ఆ దేవలుడు, దేహధారియై వెలువడి తన్ను ప్రార్థించిన కారణమడుగగా సకలలోకాధారభూతుడగు ఆ దేవలునిగూర్చి శివుడు భక్తితో, మహాత్మా! నీవు సకల జగత్కారణభూతుడవు నీ మాయాశక్తిచేత బ్రహ్మాదులమైన మేముదయించితిమి, మునుపే మాకు సూత్రవస్త్రము లొసగితివి. ఇప్పుడు నీయాజ్ఞచేత బ్రహ్మ సృజించిన లోకములందలి దేవమను యక్ష గంధర్వ కిన్నర కింపురుష గుహ్యక సిద్ధసాధ్య విద్యాధరాదులగు స్వర్గలోక వాసులును, భూలోక వాసులగు మనుష్యులును, యజ్ఞ సూత్రములు లేనందున వైదిక కర్మాచరణమం దధికారములేనివారై యున్నారు. వస్త్రములు లేక పోవుటచేత మానరక్షణోపాయ మెఱుంగక మిక్కిలి లజ్జాపీడితులై యున్నారు. బ్రహ్మదేవుడన్ననో, సకల జగత్సృష్టికి శక్తుడయ్యును సూత్రవస్త్ర నిర్మాణ విషయమున అశక్తుడుగదా! కనుక, సూత్రవస్త్ర కర్తలను కొందఱిని నిర్మించి వారలలో ఒక్కని స్థిరముగ స్వర్గాది ఊర్ధ్వలోకములకును, తక్కిన వారిని భూలోకమునకును నిర్ణయము చేయుము అని చెప్పెను. దేవలోపనిషత్తున ద్వితీయఖండమిది.

## తృతీయఖండః

జటః– అథ నిరంజనస్వరూపో దేవల ఉవాచ శివం. త్వదిచ్ఛాను
సారేణ మదంశసంయుత మేకం పురుషం సృజామి సతు
దేవతాకార్యం కరోతి. తద్వంశీయాః మనుష్యకార్యం కుర్వంతు
సతు దేవంగనామ్నా ప్రసిద్ధస్సన్ త్వదాజ్ఞాధారకో భూత్వా

త్యద్భక్తి విశిష్టో వర్తత. ఇత్యంతర్ధాత్. తతో మహాదే వాంగాత్ కోటిసూర్యప్రభా భాసమాన ఏకః పురుషోఽజా యత. దేవస్య అంగా త్సంజాతత్వాద్దేవాంగఇతి, సర్వ దేవ ప్రార్థనాం లాతీతి తస్య దేవల ఇతిచ నామద్వయ మ భూత్ దేవాంగోపి శివం నత్వా అజ్ఞాకాభవతీ త్య ప్రార్థ యత్, శివోపి సర్వేషాం దేవానాం సూత్రవస్త్రాదికం నిర్మాయ, తత్తన్మంత్రపూర్వకం దేహి త్యాజ్ఞాపయామాస శివాజ్ఞానుసారేణ దేవాంగోపి సూత్రవస్త్రా నిర్మాయ దేవేభ్యో దత్వా శివాజ్ఞయా దేవదత్తా ముద్వాహ్య తస్యాం త్రిన్ పుత్రాన్ ఉత్పాదయామాస తద్వంశీయైవ అప్రాకృత బ్రాహ్మణాః దేవాంగా ఇతివిఖ్యాతాశ్చ భూలోకే తత్ర తత్ర వసంతో వస్త్ర సూత్రాదీన్ నిర్మాయ ఉచిత విధానేన సర్వేభ్యో యచ్ఛంతి.

తా॥ తరువాత, నిరంజనాత్మకుడయిన ఆ దేవలుడు పరమే శ్వరునితో నీవు కోరినట్లు నా అంశతోగూడిన ఒక మహా పురుషుని సృజించెదను. ఆ పురుషుడు, దేవతాకార్య మొనర్చుచుండును. అతని వంశస్థులు మనుష్యకార్యమును గావించుచుందురు. అతడు దేవాంగుడను నామమున ప్రసిద్ధుడై నీ ఆజ్ఞ శిరసా వహించి నీ యందు భక్తిగలవాడగుచు వర్తించు చుండును అని చెప్పి అంతర్ధానము నొందెను.

పిమ్మట, మహాదేవుని అంగమునుండి కోటి సూర్య ప్రకాశ ముతో ఒక దివ్య పురుషు డుద్భవించెను. దేవుని అంగము వలన ఉద్భవించుటచేత దేవాంగుడనియును, దేవతల ప్రార్థనలను లాలించుటచేత దేవలు డనియును అతనికి రెండు నామము

ఏర్పడెను. ఆ దేవాంగుడు శివునకు నమస్కరించి, ప్రభూ! నాకాజ్ఞయేమని అడిగెను. శివు డపుడు, నీవు సూత్రవస్త్రములు నిర్మించి ఆయా మంత్రయుక్తముగ దేవతలకొసగుమని ఆజ్ఞాపించెను. శివాజ్ఞానుసారముగ దేవలుడు వస్త్రసూత్రములు నిర్మించి దేవతలకిచ్చెను. శివాజ్ఞతో దేవదత్తను వివాహమాడి ఆమెయందు ముగ్గురు కొడుకుల బడసెను. వారి వంశస్థులే అప్రాకృతబ్రాహ్మణులనియును, దేవాంగు లనియును ప్రసిద్ధులై భూలోకమునం దచ్చటచ్చట వసించుచు వస్త్రసూత్రములను నిర్మించి ఎవ్వరి కేరీతితగునో ఆ విధముగ అందఱికొసగుచున్నారు.

మం:- సదేవలో నిత్యశ్శుద్ధో నిరంజనో నిరామయో నిరాకులో
నిర్గుణో నిరుపాధిక సచ్చిదానందరూపోఽ ద్వితీయ పర
బ్రహ్మ స్వరూప ఇతిమంతవ్యః. దేవలోపనిషదం యోఽధీతే
సదేవపూజ్యోభవతి. సురాపానాత్పూతోభవతి. స్వర్ణస్తేయా
త్పూతోభవతి, బ్రహ్మహత్యాత్పూతో భవతి, కృత్యాకృత్యా
త్పూతో భవతి, అగమ్యగమనాత్పూతో భవతి. ససర్వాన్
వేదా నధీతోభవతి. సశుద్ధోభవతి. ససపునరావర్తత సతపు
నరావర్తత ససపునరావర్తత ఇత్యుపనిషత్.

తా॥ ఆ దేవలుడు, నిత్యనిర్మల నిరంజన నిరామయ నిరాకుల నిర్గుణ నిరుపాధిక లక్షణలక్షితుడగుచు, శక్తిజ్ఞానానంద స్వరూపముతోడ, అఖండాద్వితీయ పరబ్రహ్మమై వెలుగువాడని తెలియదగినవాడు.

ఈ దేవలోపనిషత్తును ఎవడు శ్రద్ధతో జదువుచున్నాడో, అతడు దేవపూజ్యుడై విలసిల్లును. మద్యముత్రాగుట, బంగారము

దొంగిలించుట, బ్రహ్మహత్య చేయుట, చేయగూడనిది చేయుట, పోరాని చోటులకు పోవుట మొదలగు పాపములు తొలగి పవిత్రు డగుచున్నాడు. మరియు, అతడు నిత్యపరిశుద్ధుడై సకల వేద ములా అధ్యయనము చేసినంతటివా డగుచున్నాడు. అట్టివాడు లోకములందెవ్వటికి జననమరణాదికములగు సంకటములందు దగులుకొనువాడు కాడు కాడు కాడని ముమ్మాటికి దేవలోనిషత్తు తెలుపుచున్నది.

## బ్రహ్మాండపురాణోక్త

### -1 దేవాంగప్రస్తావ తార కాల నిరూపణము :-

శ్లో॥ నక్షత్రయంచ వసవో నేత్రర్షి శశినోగతాః
శ్వేతవారాహకల్పాద్య సంఘో కృతయుగాబ్దకాః
చత్వారి సురవర్త్మాని తర్కాంకనయ నేందవః
మహాయుగత్రియస్యేమే దీర్ఘా స్సంవత్సరాగతాః
తథాకృతయుగాబ్దశ్చ చతుర్థంతు మహాయుగే
త్రిశూన్యం వసవోనేత్రి సాగరశ్శశినోగతాః
త్రేతాదిమార్ధే త్రిశూన్యం వసు వేదర్తు వోగతాః
శూన్యత్రియం వేదతర్క శూన్య సప్తేందవప్పమాః
సర్జనాత్ ప్రాక్ జగత్సృష్టు స్త వతోవత్సరాఇమే
కల్పాబ్ద పిండాత్తే త్యాజ్యాః శేషావ్సృష్ట్యాదివత్సరాః
తతో పరార్ధే త్రేతాయాం పర్జనారంభ ఉచ్యతే
గ్రహర్క్ష దేవదైత్యాది ప్రక్షతోఽన్య చరాచరం
కల్ప కల్పాంతరేష్వేవం ప్రపంచేతు ప్రకాశితాః
సదా సాయుజ్య పీఠాఢ్యే సహస్రారాంతరస్థితః
దేవాంగః ప్రథమాస్సృష్టిః శంకరస్య మహాత్మనా

విద్యాధరోద్వాపరాదే మధ్యేఽభూత్పుష్పదంతకః
అంతేఽవతీర్ణో బేతాళః కలౌవరరుచిస్తథా
జాతే శుక్లేపూర్ణిమాయామూర్జే విద్యాధరోద్భవః
పుష్పదంతోద్భవశ్చైవ పంచమ్యాం మత్స్యయుక్ సితే
పూర్ణిమాయాంసితేరాధే బేతాళస్య సముద్భవః
మార్గేశుక్ల దశమ్యాంతు జాతో వరరుచిస్తథా
దశమ్యాశుక్లనభసి చిత్రయోగి సముద్భవః
మాఘే శుక్లేహరితిథౌ దేవశాలి సముద్భవః
దేవదాసోద్భవ శ్శుక్లే పంచమ్యాం మధుమాసకే
సప్తావతారా ఏతేస్మై దేవాంగబ్రహ్మణస్స్మృతాః

తా॥ శ్వేతవారాహకల్పాదిసంధియందు గతించిన కృతయుగ సంవత్సరములు పదునేడు లక్షల యిరువదెనిమిది వేలును (17,28000) మూడు మహా యుగములకును గతించిన సంవత్సరములు ఒకకోటి యిరువది తొమ్మిది లక్షల అరువది వేలును, (1.29.60000) నాలుగవ మహాయుగమున గతించిన కృతయుగ సంవత్సరములు పదునేడు లక్షల యిరువదెనిమిది వేలును, (1728000) త్రేతాయుగమునందు మొదటి సగమున గతించిన ఆరులక్షల నలువది యెనిమిది వేల సంవత్సరములును, కలిసి మొత్తము ఒక కోటి డెబ్బది లక్షల అరువది నాలుగువేల సంవత్సరముల కాలము సృష్టికర్తయగు బ్రహ్మదేవుడు, లోకసృష్టి కొఱకు ఆలోచనచేయుచుండినకాలము దీనినే బ్రహ్మదేవుని తపఃకాలమందురు. ఈ మొత్తమును కల్పాబ్ద పిండ సంఖ్యనుండి తీసివేయగా మిగిలినవియే సృష్ట్యాదిగతవత్సరము లగును. ఇట్టి నిరూపణము వలన త్రేతాయుగము ఉత్తరార్ధ ప్రారంభముననే లోకసృష్టి ఆరంభమైనట్లు నిర్ణయమగుచున్నది.

అనాదిగను, ప్రాచీనముగను సమస్త జంగమ స్థావరాత్మకముగ నుండి మహాప్రళయాంతమందు లీనమయ్యెడు సర్వలోక సము దాయము, మరల గ్రహనక్షత్ర దేవదానవాదికసమూహముతోడ కల్పితమగుచుండును. ఈ విధముగనే సమస్త ప్రపంచములను సర్వకల్ప కల్పాంతరము లందేర్పడు చుండును. అట్టి సృష్టి ప్రారంభమయిన త్రేతాయుగోత్తరార్ధకాలమునందే సాక్షాత్పర శివుడు, తన సహస్రారపద్మాంతరాళమున సాయుజ్యపీఠాఖ్యుడై జ్యోతిరూపమున ప్రకాశించు దేవలబ్రహ్మమును సూత్రవస్త్ర నిర్మాణమునకై సాకార బ్రహ్మమును గావించెను. ఆ దేవల బ్రహ్మయే లోకోపకారార్ధము భూలోకమున ద్వాపరయుగారంభ మున విద్యాధరుడుగను, ద్వాపరయుగమధ్యకాలమున పుష్ప దంతుడుగను, ద్వాపరయుగాంత్యమున బేతాళుడుగను, అవత రించెను. మరియును ఆ లోకారాఖ్యుడు కలియుగమున వరరుచి చిత్రయోగి, దేవశాలి, దేవదాస నామముల నవతరించెను.

అట్టి సప్తావతార క్రమమున కార్తిక శుద్ధ పూర్ణిమ యందు విద్యాధరుడును, ఆశ్వయుజ శుద్ధ పంచమియందు పుష్పదంతు డును, వైశాఖ శుద్ధ పూర్ణిమయందు బేతాళుడును, మార్గశిర శుద్ధ దశమియందు వరరుచియును. శ్రావణ శుద్ధ దశమియందు చిత్ర యోగియును, మాఘ శుద్ధ ఏకాదశియందు దేవశాలియును, చైత్రశుద్ధ పంచమియందు దేవదాసుడును ఉద్భవించిరి ఇట్లు శ్రీ దేవాంగబ్రహ్మ సప్తావతారకాల నిర్ణయము ప్రపంచమున విశ్రుత మగుచుండును.

జటి- నిరతిశయగుణగరిష్ఠ శాండిల్యో నిఖిల జగన్నిర్మాణ
కారణం చతురాననం పరిసమేత్యోవాచ అధీహి భగవన్

దేవాంగ సప్తావతార స్వరూపం యద్యదవతారే యద్య త్కృతం తత్సర్వం సమగ్రేణేతి. సహోవాచ పితామహశ్చ ఈశాన స్సర్వవిద్యానామితి శివోహి సకల విద్యాధీశ్వర త్వేవ విద్యమానత్వాత్, భూలోకే విద్యాప్రచురార్థం దేవాగ సప్తావతారం భూమౌ జన్మప్రాప్నుహీతి అజ్ఞాం దత్తవాన్ తజ్జన్మకారణ వృత్తాంతస్తు సామ వేదాంతర్గత చతురధికా శీతి శతతమ శాఖీయ ధర్మతత్త్వోపనిషది స్పష్టం తదా దేవాంగో విద్యాధరాది సప్తస్వరూపైః భూమావ వతీర్య సకల మునిపూజితస్సన్ కాంశ్చిత్ గ్రంథాన్ చకార.

తా॥ పూర్వము నిరుపమాన గుణ గరిష్ఠుడగు శాండిల్య మహాముని లోకసృష్టి కారకుడగు బ్రహ్మదేవునిజేరి, స్వామీ! దేవాంగుని సప్తావతార స్వరూపము తెలియగోరు చున్నాము. ఆతడు, ఏయే అవతారముల ఏయే కార్యము లొనర్చెనో, ఆ విష యము పూర్తిగ నాకు జెప్పవలసినది. అని అడుగగా బ్రహ్మ దేవుడు, శాండిల్యున కిట్లుచెప్పెను. మునీంద్రా! "ఈశాన స్సర్వ విద్యానామ్" అను ప్రమాణమునుబట్టి సాక్షాత్ మహేశ్వరుడే విద్యలన్నిటికీ అధీశ్వరుడని తెలియుచున్నది గదా! ఆ పర మేశ్వరుడు, సమస్త విద్యలను భూలోకమున వ్యాపింపజేయ వలయునని అది నెరవేర్చుటకు దేవాంగుని భూలోకమున పదవ తారము లెత్తున ట్లాజ్ఞాపించెను. ఆ దేవాంగుని జన్మకారణ వృత్తాంతము సామవేదమున నూట యెనుబది నాలుగవ శాఖతో జేరిన ధర్మతత్త్వోప నిషత్తునందు స్పష్టముగ మున్నది.

పరమేశ్వరుని ఆజ్ఞానుసారముగ, విద్యాధర, పుష్పదంత, బేతాళ, వరరుచి, చిత్రయోగి, దేవశాలి, దేవదాస నామములతో దేవాంగబ్రహ్మ భూలోకమున సప్తావతారములు వహించి, సకల మునిగణపూజితుడగుచు, ఆయా అవతారాను గుణముగ కొన్ని గ్రంథములు రచించెను. ఆ గ్రంథ వివరము తెలియజేసెద వినుము.

శ్లో॥ ఋగ్భాష్యం మను సూత్రంచ సంధ్యాసూత్రం మనుస్మృతిం
దేవలోపనిధిం దేవ రాజచ్ఛంద స్తథైవచ
వాదం దేవలజైమిన్యో వర్ణాశ్రమ మహోదధిం
బ్రహ్మసూత్ర నిఘంటుశ్చ మనుజ్ఞాన శిఖామణిం
చకార దశచైతాని విద్యాధర మహామునిః.

తా॥ దేవాంగ మనువు, విద్యాధరావతారమున ఋగ్వేద భాష్యము, మానవధర్మ సూత్రము, సంధ్యా సూత్రము, మను స్మృతి, దేవలోపనిధి, దేవరాజ ఛ్ఛందస్సు, దేవల జైమిని సంవాదము, వర్ణాశ్రమ మహోదధి, బ్రహ్మసూత్ర నిఘంటువు, మనుజ్ఞాన శిఖామణి అనెడు పది గ్రంథములు రచించెను.

శ్లో॥ దేవీ భాగవతం చైవ దేవరత్నాకర స్తథా
తథా మేరుచరిత్రంచ వేదాంతాంకుశ మేవచ
బ్రహ్మోపదేశ సిద్ధాంతం దేవరాజను శేఖరం
సుజ్ఞాన దీపికాచాపి మహిమ్న స్తోత్రమేవచ
తథైవోత్తర మీమాంసా మగ్ని సూత్రమిమేదశ
పుష్పదంతావ తారేను దేవాంగేన వినిర్మితాః

తా॥ దేవాంగమనువు, పుష్పదంతావ తారమున. దేవీ భాగవతము, దేవ రత్నాకరము, మేరుచరిత్రము, వేదాంతాం కుశము, బ్రహ్మోపదేశ సిద్ధాంతము, దేవరాజ సుశేఖరము' సుజ్ఞాన దీపికా, మహిమ్న స్తోత్రము, ఉత్తర మీమాంసా, అగ్ని సూత్రము, అను పది గ్రంథములు రచించెను.

శ్లో॥ చతుష్షష్ఠి కళాసూత్రం ధనుశ్శాస్త్రి తథైవచ
బేతాళ పంచ తంత్రించ బేతాళాఖ్యాన మేవచ
భూసూక్తం స్మరశాస్త్రించ మల్లసాధన నిర్ణయం
మహాభైరవ సూక్తంచ మంత్రశాస్త్రింత థైవచ
తథా మంత్రి నిఘంటుశ్చ బేతాళేన వినిర్మితమ్.

తా॥ దేవలమనువు, బేతాళావ తారమున, చతుష్షష్ఠి కళా సూత్రము, ధనుశ్శాస్త్రము, బేతాళ పంచతంత్రము, బేతాళా ఖ్యానము, భూసూక్తము, స్మరశాస్త్రము, మల్లసాధన నిర్ణయము, మహాభైరవ సూక్తము, మంత్రి శాస్త్రము, మంత్ర నిఘంటువు అను పది గ్రంథములు రచించెను.

శ్లో॥ సూ తతత్త్వ నిఘంటుశ్చ తథా గణిత శాస్త్రకం
తథాచ చంద్ర సిద్ధాంతం సూర్య సిద్ధాంత మేవచ
త్రిలింగం దత్త మీమాంసా త్రిశిష్టూపాత్ర నిర్ణయం
కౌముదీశబ్ద శాస్త్రంచ వస్త్వాయుర్నిర్ణయం తథా
భాగశాస్త్రం యోనితంత్రం పిండోత్పత్తి క్రతం తథా
ఛందోజ్ఞం సంధి సూత్రించ కాజా దన్యాయ బోధినీం
నరపింగళి శాస్త్రంచ తథా లక్షణ దర్శనం
స్వరశాస్త్రంచ వేదాంగ మా లాయుర్వేద మేవచ

యేతద్వింశతి శాస్త్రాణి దేవాంగేనామి తౌజసా
వర రుచ్యవతారేతు నిర్మితాని మహీతలే.

తా॥ మహాతేజస్వియగు దేవాంగ మనువు, వరరుచ్యవతారమున, సూత్రతత్వ నిఘంటువు, గణిత శాస్త్రము, చంద్ర సిద్ధాంతము, సూర్య సిద్ధాంతము, త్రిలింగ శాస్త్రము, దత్త మీమాంసా, శ్రుతిషట్సూత్ర నిర్ణయము, కౌముది అను శబ్ద శాస్త్రము, వస్త్రాయుర్నిర్ణయ శాస్త్రము, భాగశాస్త్రము, యోని తంత్రము, పిండోత్పత్తి శాస్త్రము, ఛందోజ్ఞము, సంధి సూత్రము కాణాదన్యాయ బోధిని అను తర్కశాస్త్రము, నరపింగళి శాస్త్రము, లక్షణ దర్శనము, స్వరశాస్త్రము, వేదాంగమాల, ఆయుర్వేదము అనెడు ఇరువది గ్రంథములు రచించెను.

శ్లో॥ మనుకల్పం మంత్రశాస్త్రం నిగమాంత మహోదధిం
శ్రీ దేవల జయస్తంభం మనుశిల్పం తథైవచ
సద్వేతాంతకురారంచ దేవలాఖ్యాన మేవచ
తథా శంభుశిఖా సూత్రం గాయిత్రీ భాష్యమేవచ
దేవస్మృత్యోంకారసూక్తి పంచ యజ్ఞవి నిర్ణయం
యజ్ఞోపవీత సూక్తంచ సంధ్యా భాష్యంత థైవచ
దేవీ మాహాత్మ్యకం చైవ రుద్రభారత మేవచ
గిరిజోద్వాహ మిత్యేతే నిర్మితాశ్చిత్ర యోగినామ్.

తా॥ దేవాంగ మనువు, చిత్రయోగిగా అవతరించి, మను కల్పము, మంత్ర శాస్త్రము, నిగమాంత మహోదధి, శ్రీ దేవల జయస్తంభము, మనుశిల్పము, గాయత్రీ భాష్యము, దేవస్మృతి, ప్రణవ సూక్తము, పంచయజ్ఞ నిర్ణయము, యజ్ఞోపవీత

...సూక్తము, సంధ్యా భాష్యము, దేవీ మాహాత్మ్యము, రుద్ర ...భారతము, గిరిజో ద్వాహము. అనెడు గ్రంధములు రచించెను.

శ్లో॥ ప్రామాణ్యవాద సుజ్ఞాన దీపికా జ్ఞానమంజరీ
సుజ్ఞానరత్న మాలాచ సద్వాద జ్ఞానమంజరీ
పంచశిఖా నిర్ణయశ్చ దేవక ల్పాత్మ దర్పణం
పూర్వాపర ప్రయోగశ్చ తథా దేవరహస్యకం
ఏతద్ది శాస్త్రదశకం సత్కర్మ జ్ఞానబోధకం
దేవశాల్య వతారేతు దేవాంగేనవి నిర్మితమ్.

తా॥ దేవాంగబ్రహ్మ, దేవశాల్యవతారమున ప్రామాణ్య వాదము, సుజ్ఞాన దీపిక, జ్ఞానమంజరి, సుజ్ఞాన రత్నమాల, సద్వాద జ్ఞానమంజరి, పంచశిఖా నిర్ణయము, దేవకల్పాత్మ దర్పణము, పూర్వాపర ప్రయోగము, దేవరహస్యము, సత్కర్మ జ్ఞాన బోధకము, అను పది శాస్త్రములు రచించెను.

శ్లో॥ అంబాస్తుతిం గురుస్తోత్రం తథా శృంగార నిర్ణయం
తంతుసూత్రం తథా శ్రీవణాంకుశం కాలవేదనాం
ఏకవింశతి సద్దీక్షావిధి ర్లక్షణ నిర్ణయం
పండితారాధ్య చరితం శైవ సిద్ధాంత మేవచ
తథాప్రభు శిఖారత్నం మూల స్తంభన భాష్యకం
తథా వీరాగమ వ్యాఖ్యాం టీకాం శైవాగమస్యచ
ఏతచ్చతుర్దశ గ్రంధాన్ తత్వజ్ఞాన ప్రబోధకాన్
దేవదాసావతారేతు దేవాంగః కృతవానభూత్.

తా॥ దేవలబ్రహ్మ దేవదాసావ తారమున, అంబాస్తుతి, గురుస్తోత్రము, శృంగార నిర్ణయము, తంతు సూత్రము, శ్రీవ

డాంకుశము, కాలజ్ఞానము, ఏకవింశతి దీక్షావిధి, లక్షణ నిర్ణ యము, పండితారాధ్య చరిత్రము, శైవ సిద్ధాంతము, ప్రభు శిఖారత్నము, మూల స్తంభన భాష్యము, వీరాగమ వ్యాఖ్యా నము, శైవాగమటీక అనెడు తత్త్వార్థ బోధకములను పదు నాలుగు గ్రంథములు రచించెను.

బ్రహ్మాండ పురాణాంతర్గత

## -: శ్రీ చౌడేశ్వరీ సంభవము :-

శ్లో॥ ఆషాఢామార్గ రాత్రాంతే దైత్యైః స్పంపీడితో భృశం
పునర్జాత వదాసీస్త్వం యస్మా న్మాం స్మృతవానసి
మజ్జన్మదినం మత్వా నియమే వరమేస్థితః
మత్పూజాం కృతవాన్ భూయాః కృతకృత్యో భవిష్యసి
రిపుక్షయో భవేద్వత్స వంశవృద్ధిః ప్రజాయతే
త్వద్వంశ సంభవాయేచ తేఽతి భక్తి సమన్వితాః
మత్కథా శ్రవణంకృత్వా స్తుత్వా సత్యార్చనాదిభిః
తోషయిత్వా భజేయుశ్చ తేషాం వృద్ధిం దదామ్యహం
ప్రమాదాద్యది లభ్యేత తేషాం దుఃఖం పదేపదే
ఇత్యుక్త్వా సా మహాదేవీ తత్రైవాంతర ధీయత.

తా॥ శ్రీ దేవాంగబ్రహ్మ, సూత్రవస్త్ర నిర్మాణంబునకై విష్ణు నొద్దకేగి తంతువులు గొనివచ్చు చుండగ రాక్షసు లడ్డగించి అర్ధరాత్రమున బాధింప, అప్పుడాతడు భక్త వరాధీనయగు జగ దీశ్వరిని ప్రార్థించెను. ఆ మహాదేవి, తన కిరీటపు గాంతులు రాక్షసులకు మిఱుమిట్లు గొలుప చౌడేశ్వరియై ఆవిర్భవించి, రాక్షస నిర్మూలనము గావించి దేవలునకు విజయ ప్రదాత్రియై

యిట్లు చెప్పెను. వత్సా! ఈ ఆషాఢా మావాస్యార్ధ రాత్రిమున రాక్షసులచేత జిక్కుపడి రక్షణార్థము నన్ను ధ్యానించితివి. నీకు పునర్జన్మ కలిగినట్లయ్యెను. నిన్ను రక్షింప నావిర్భవించితిని. ఇది మొదలుగ నాజన్మ దినమగు ఈ ఆషాఢామావాస్య పర్వదినమున మరుతక నియమముతో గూడినవాడవై నన్ను బూజింతువేని శత్రు జయము నొందుచు వంశాభివృద్ధితోడ కృతార్థుడ వయ్యెదవు ఇటులనే నీ వంశీయులును నేతలు మొదలగు లౌకిక వృత్తులుమాని, ఈ మహా పర్వదినమున నియమ నిష్ఠలతోడ నా కథలు వినుచు, నన్ను స్తుతించుచు, షోడశోప చారములతో నన్ను బూజించుచు, నాకు సంతోషము గూర్చు వారగుదురేని వారి కన్ని విధముల అభివృద్ధి గలిగింతును. పొరపాటున నన్ను మఱచి పూజింపరేని మాటిమాటికి దుఃఖముల బొందు వారగుదురు. అనిచెప్పి, ఆ దేవి అక్కడనే అంతర్ధానము నొందెను.

స మా ప్తి.

# నా అముద్రిత రచనలు

పల్నాటి వీరభారతము : దృశ్యకావ్యము
(నాయకురాలు, అలరాజు రాయభారము,
పల్నాటి యుద్ధము అను మూడు నాటకములు)
శివ ధనుర్భంగము : నాటకము (సీతా కళ్యాణము)
బాణాసుర : నాటకము (ఉషా పరిణయము)
రతీ మన్మథము : ద్విపద కావ్యము
శివానంద కందము
చౌడాంబా ద్విశతి
మానసబోధ శతకము
గురుదేవ శతకము
వేంకటేశ్వర శతకము
చెన్నకేశవ శతకము
మధురాక్షరలు
కవితా విపంచి : ఖండ కావ్యములు
పుత్రి శతకము
నీతిగీతి

మరికొన్ని